శ్రీమద్భగవద్గీత (తెలుగు)
వెల మూడ్రాయలు: వెల రూ 4-0-0.
(ప్యాకింగు పోస్టేజి రూ 0-9-0)
వసంస్కృతమూలము, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వ్రాసిన తెలుగు టీకాతాత్పర్యవిశేషార్థ వివరణములు గల 400 పుటల గ్రంథము, గీతాధ్యయనము చేయువారికి మిక్కిలి ఉపయుక్తమైనది.
మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల, 7, తంబు శెట్టి వీధి – జి. టి. మదరాసు.



# ఆంధ్రపత్రిక

3/12/48

The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 35 No. 237 TUESDAY 30th NOVEMBER 1948 వెల ఒక అణా { Founder: K. Nageswara Rao



మదరాసు రేసులు
1948—49
డిశంబరు మీటింగు
4-12-48 శనివారము.
"మద్రాసు కప్"
11-12-48 శనివారము.
"న్యూజెండ్ గ్రాంట్ మెమోరియల్ కప్"


# "ఈపథకం ఆమోదించకపోతే నా రాజీనామా అంగీకరించండి"

## పరిషత్తుకాంగ్రెస్ పక్ష సమావేశంలో పండిట్ నెహ్రూ తీవ్ర హెచ్చరిక

### మార్గాంతరం లేక కొత్తఏర్పాటుకు సభ్యుల సమ్మతి

### సందేహాస్పద విషయాలపై విశదీకరణ కోరుతూ అట్లీకి భారతప్రధానమంత్రి లేఖ

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, నవంబరు 28: ఇండియాకు బ్రిటన్‌తో అత్యంత సన్నిహిత సంబంధాలుండవలెనన్న పండిత నెహ్రూ పథకానికి రాజ్యాంగపరిషత్ కాంగ్రెస్‌పార్టీ నేడు అతి తీవ్రమైన చర్చ జరిగిన మీదట ఆమోదించెను. ఈ విజయమును సాధించుటకు పండిత నెహ్రూ చాల కష్టపడవలసివచ్చినది.

పార్టీలోని సాధారణసభ్యులందరూ ఈ పథకాన్ని మొదట తీవ్రముగా ప్రతిఘటించిరి. అందులో కొందరు ఈ పథకాన్ని 'అర్థంలేని పదజాలము' అని విమర్శించిరి. "ఇండియా కామన్వెల్తులో చేరుటకే నిర్ణయించుకున్నదని బాహాటంగా చెప్పితే బాగుంటుంది. కాని 'సర్వతంత్ర స్వతంత్ర ప్రజాస్వామికము' (సావరిన్ ఇండిపెండెంట్ రిపబ్లిక్) అని పెద్ద మాటలు సృష్టించి దాని చాటున అసలు ఆశయం దాచ ప్రయత్నించటం ఉచితంగా లేదు." అని కొందరు అతివాదులు విమర్శించిరి.

దానితో ప్రధాని కూడా సవాలును అంగీకరించి తనవాదాన్ని సమర్థించు కొనుటకు రంగములో ప్రవేశించెను. తన రాజకీయ విధానాలనూ, పథకాలనూ ఆమోదించలేకపోతే ప్రధానిగా వేరొకరిని ఎన్నుకోవలసినదని కూడా ఆయన సభ్యులను హెచ్చరించెను. దానితో అతివాదులు వెనుకకు తగ్గిరి. పండిత నెహ్రూ ఈ విధంగా బెదిరించుటవల్లనే అత్యంత ఉద్రేకంతో కూడుకొనియున్న సభా వాతావరణం చల్లపడటం సాధ్యమైనది. అతివాదులు వెనుకకు తగ్గగానే మితవాదులు ముందుకు వచ్చి నెహ్రూ పథకములో పూర్తిగా ఏకీభవించిరి.

### నెహ్రూ పథకస్వరూపం

నెహ్రూ పథకంలో, భారత రిపబ్లిక్ నకు కామన్వెల్తుతో అత్యంత సన్నిహిత సంబంధాలుండవలెనని ప్రతిపాదించబడినది. ఈ కామన్వెల్తులో ప్రస్తుతము పోరుదుగా బ్రిటిష్ రాజు పరిగణించబడును. ఈ పథకాన్ని గురించి పూర్తివివరాలింకా తెలియక పోయినప్పటికీ, దీని ననుసరించి రక్షణవ్యవహారాలలో భారత దేశము కామన్వెల్తులోని ఇతర స్వతంత్ర దేశాలతో సమానముగా పరిగణించబడునని తెలుస్తున్నది. ఈ రక్షణ వ్యవహారాలలో, ముఖ్యాంశాలను పరస్పరం తెలియ జేసుకొనటం, యుద్ధ శిక్షణకై బ్రిటనులోనూ ఇతర చోట్లనూ సౌకర్యాలు కలిగించటం, ఆధునిక ఆయుధ సామగ్రులను సప్లయి చేయటం మొదలైనవి చేరుతవి. ఇండియా, బ్రిటనులు ఒక సంయుక్త రక్షణ ఒడంబడికను చేసుకొనుటకు కూడా

(4-వ పేజీ చూడుడు)

## 'పోలీసులు గాంధీజీని అనుసరించాలి'

### బొంబయి హోంశాఖ మంత్రిప్రబోధం

కేంద్ర కార్యాలయంలో మహాత్ముని చిత్రపటా విష్కరణ

బొంబాయి, నవంబరు 28: బొంబాయి పోలీసు ప్రధానకార్యస్థానమందు, హోమ్ శాఖమంత్రి మురార్జీ దేశాయిగారు నేడు గాంధీజీ చిత్రమును ఆవిష్కరించుచూ:

"పోలీసువారు మహాత్ముని ప్రబోధమును శిరసావహించి ప్రజాసేవకులుగా వర్తిల్ల వలెను. అందను పోలీసుశాఖ ఆదర్శప్రాయమైనదని ప్రపంచమునందు వ్యాప్తియున్నది. మన పోలీసుశాఖ వారిని అధిగమించి నైతికధర్మమును ప్రదర్శింపగలదని ఆశించుచున్నాను. ప్రజలపై అధికారము చలాయించుటయే కర్తవ్యముగా ప్రవర్తించు పాతపద్ధతుల మానవలెను. ప్రజాసేవకులై వన్నెకు రావలెను. మహాత్ముని ఆదర్శములను మాటలలోగాక చేతలలో చూపవలెను.

"మహాత్ముని సేవాపరతే మీకు పోలీసు వారికి ఆదర్శజ్యోతి యగుగాక!" అని బొంబయి ప్రధాని బి. జి. ఖేర్ గారు సందేశమంపిరి.

## పాకిస్థాన్ అంతా దండెత్తివచ్చినా ఒక్క తూర్పు పంజాబు అటు కట్టించగలదని బల్దేవ్‌సింగ్ హామీ

జలంధర్, నవంబర్ 28: "కాశ్మీరుపై దండయాత్రచేయుటకు 50 వేల పఠానులు సిద్ధముగా నున్నారన్న పత్రికలు ప్రకటించియుండెను. ఈ 50 వేల మందిని పారద్రోలుటకు గురుదాస్‌పూరు, అమృతసర్, ఫిరోజ్‌పూరుజిల్లాలలోనే తగినంతమంది సైనికులున్నారు. పాకిస్థానీలందరు మనపై ఎత్తివచ్చినను, వారిని పారద్రోలుటకు ఒక్క తూ. పంజాబులోనే కావలసినంతమందియున్నారు." అని భారత దేశరక్షణ శాఖామంత్రి సర్దార్ బలదేవసింగుగారు మహిల్‌పూరులో సైనికులనుద్దేశించి సమ్మేళనమునందు ఉపన్యసించుచు ప్రకటించిరి.

పాకిస్థానుకు అపకారం చేయుఉద్దేశ్యము భారతదేశమునకు కించిత్తుమాత్రము లేదని, భారతదేశమునకు అపకారము చేయవలెనని యింకను పాకిస్థాను ఉద్దేశించుచున్నదని సర్దార్ బలదేవ సింగుగారు చెప్పుచు పాకిస్థాను ముందుగూడ యిట్టి వైఖరినే అవలంబించు చెడల పాకిస్థాను కష్టముల పాలుకాక తప్పదని, పాకిస్థాను స్థితికే భంగము కలుగునని సర్దారు హెచ్చరించెను. తూ. పంజాబునందలి వివిధ పార్టీల విశేషములవిషయమై సర్దారు ప్రస్తావించుచు పాంథిక్ పార్టీవారు 1946 సం॥ పు ఎన్నికలలో కాంగ్రెస్‌తో పోటీ చేసి యుండినప్పటికీ, కాంగ్రెసుకు ప్రతికూలమైన పనులుగాని, జాతీయతకు భంగము కలిగించు పనులుగాని పాంథిక్ పార్టీ చేసియుండలేదని, సిక్కులు ఎల్లప్పుడు కాంగ్రెస్‌లోనే యుండిరని, ఇకముందు గూడ కాంగ్రెస్‌లోనే యుందురని ప్రకటించిరి.

ప. పంజాబునుండి వచ్చిన, శరణాగతులకు పునరావాసములు కల్పించి, వారు సౌభాగ్యవంతులుగా నుండునట్లు చేయుటయే రాష్ట్రీయప్రభుత్వోద్దేశ్యమని తూ. పంజాబు ప్రధాని డా॥ గోపీచంద్ భార్గవాగారు చెప్పిరి.

దేశస్వాతంత్ర్యమును రక్షించు ఏకైకోద్దేశ్యముతో కాశ్మీరులో అన్నిరాష్ట్రములవారు పోరాడుచుండిరని లెఫ్టినెంటు జనరల్ కరియప్పగారు చెప్పిరి.

రక్షణశాఖమంత్రికి ఒక లక్ష 25 వేల రూపాయిల ద్రవ్యము సమర్పింపబడినది. కాశ్మీరు యుద్ధములో మరణించినవారి కుటుంబములకు రక్షణశాఖమంత్రి రొక్కము, పారితోషికములు యిచ్చెను.

అంతకుపూర్వం సర్దార్ బలదేవసింగుగారు ఖాల్సా కళాశాల శంకుస్థాపనము గావించుచు హిందువులు సిక్కులు సోదరులవలె మెలగవలెనని ఉద్బోధించిరి. సిక్కుల కోర్కెలను రాజ్యాంగ పరిషత్తు వారు విచారించి సిక్కులకు న్యాయము చేసెదరనిరి. అ. ప్రె.

## వేనకువేల ముస్లిములు శత్రుపక్షమును విడనాడుచున్నారు

### కాశ్మీరులో సునాయాసముగా తెలుస్తుంది హృదయ పరివర్తనము

ఫ్రంట్, నవంబరు 28: 'కాశ్మీరు ముస్లిములు ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వ పక్షమును విడనాడి వేనకువేలుగా మనపక్షమునకు వచ్చి చేరుచున్నారు. ఇందువల్ల శత్రువుల ప్రచారము అబద్ధమని బయల్పడుచున్నది' అని కాశ్మీరునందలి భారత సైనిక పర్యవేక్షకుడొకడు వ్రాయుచున్నాడు.

రాంఘర్ కోట ఠానమునుండి మధ్యప్రాంతమునందు మూడువేలపైగా ముస్లిములు ఆజాదీలను విడనాడి ఒక్కుమ్మడిమనపక్షమునకు వచ్చి వేసిరి. ఇంకను అనేక వేలమంది తాము శాంతియుతముగా జీవింపగోరుచున్నట్లు తమ ప్రతినిధులద్వారా మన సేనానాయకులకు వార్తపంపిరి. పఠాను కొండజాతులవారు, ముస్లిములను రెచ్చగొట్టుటకై వచ్చిన పాకిస్థానీలు, స్థానిక ముతావేశపరులు ఆ ప్రాంతమునందలి ముస్లిములకు మతావేశము కలిగించి కత్తిజూపి ఆజాద్ ఫౌజులో చేరవలెనని బలవంతపెట్టిరని వారు వెల్లడించియున్నారు. ముందుకు నెట్టుకొని వెళ్లుచున్న మన సైనికదళముల పురోభాగమున, శత్రువులు పారద్రోలబడిన ప్రాంతములో మన విమానాలు కరపత్రములు వెదజల్లుటవల్ల సంశయాత్ములును, తటస్థులును మనకు అనుకూలురైరి. శత్రుపక్షమును విడనాడి తిరిగి వచ్చుచున్న ముస్లిమ్ గ్రామస్థులకు వారి స్వగృహములలో పునరావాసములు కల్పింపబడుచున్నవి అని సైనిక పర్యవేక్షకుడు వ్రాయుచున్నాడు. అ. ప్రె.

## శ్రీ వి. జి. దేశ్‌పాండే

న్యూఢిల్లీ, నవంబరు 28: శ్రీ వి. జి. దేశ్‌పాండేగారు హిందూ మహాసభా కార్యదర్శి. ఈతడు న్యూఢిల్లీయందలి హిందూమహాసభలో 'ఇంటరన్' గావింపబడెను. అనగా బందీగా నుంచబడెను. బీరారునందలి బుల్డానాజిల్లాలోనున్న తన కుటుంబమును కలిసికొని వారితో మూడు వారములు గడుపుటకు ఢిల్లీ జిల్లామేజిస్ట్రేటు శ్రీ దేశ్‌పాండేగారికి అనుమతి యొసంగిరి. ఆయన నేడు పంజాబు మెయిలులో స్వస్థలమునకు బయలుదేరి వెళ్లెను.

## "యాల్టా ఒడంబడికే నేటి చైనాదుస్థితికి మూలకారణం"

### ట్రూమన్‌కు చాంగ్‌కైషెక్ లేఖ

వాషింగటను, నవంబరు 27: యాల్టాలో అమెరికా ఇంగ్లండు రష్యాలు కలసి యుద్ధకాలమందు చేసికున్న ఒడంబడిక వరకు లందు కొన్ని లోపములు జరిగి యుండుటవల్లనే చైనా కమ్యూనిస్టులు మంచూరియాను జయించుటకు అవకాశమేర్పడినది. యాల్టా ఒడంబడిక షరతులను నిర్ణయించుటలో తన రాజ్యాంగ సూత్రప్రకారము అమెరికా ప్రభుత్వము సరిగా చూపలేక పోయినదని వివరించుచు ఇప్పుడైనను చైనాను రక్షించుటకు అమెరికా సహాయము చేయవలెనని కోరుచు చైనా ప్రెసిడెంటు చాంకైషేకు ఇటీవల అమెరికా ప్రెసిడెంటు ట్రూమనుకు వ్రాసెనని వాషింగటను నగరములోని అధికార వర్గములవారు తెలియజేయు చున్నారు. చాంకైషేకు యుత్తరము తనకు అందినట్లుగా మాత్రమే ట్రూమను జవాబు నిచ్చెనని తెలియుచున్నది.

చాంకైషేకు సతి అమెరికా ప్రభుత్వ సహాయమును కోరుటకై బయలుదేరు చుండిన ముహూర్తంలోనే అమెరికా అధికార వర్గములు పై విషయములను వెల్లడి చేసిరి.

## ప్రపంచ ప్రజాస్వామిక మహిళా సమావేశం

### భారత ప్రభుత్వంపై సోవియెట్ పత్రిక ఆరోపణ

మాస్కో, నవంబర్ 27: కడచిన అక్టోబర్ నెలలో కలకత్తాలో జరగవలసిన అంతర్జాతీయ ప్రజాస్వామిక మహిళా సమావేశాన్ని భారత ప్రభుత్వం ప్రచ్ఛన్నంగా భగ్నపరచినదని సోవియట్ ట్రేడ్ యూనియన్ కౌన్సిల్ పత్రిక 'ట్రుడ్' నేడు ఆరోపించినది. అఖిలభారత మహిళా సభలోని ప్రతీప నాయకులు ప్రజాస్వామిక మహిళోద్యమానికి సర్వ శత్రువులని ఈ పత్రిక నిందించినది.

ఈ సమావేశాన్ని జరపవలెనని అంతర్జాతీయ ప్రజాస్వామిక మహిళా సంఘం భారత ప్రభుత్వమును కోరగా, వారు వీలుకాదని ఇచ్చిన సమాధానం ఆసియా దేశాలలో ప్రజాస్వామిక మహిళోద్యమాన్ని దెబ్బకొట్టటానికని చేసినపని అని ఆ పత్రిక విమర్శించినది.

అంతర్జాతీయ ప్రజాస్వామిక మహిళా సంఘ కార్యాలయం బుడాపెస్టులో ఒక ప్రత్యేక సమావేశం జరిపి మరొక ఆసియా దేశంలో ఆసియా మహిళా సమావేశాన్ని జరుపుటకు నిర్ణయించినది.

## అధ్యక్షుడు ట్రూమన్ యూరపు పోవుటలేదు

వాషింగ్టను, నవంబరు 28: అధ్యక్షుడు ట్రూమను యూరపునకు పోవునున్నాడన్న వార్త అబద్ధమని ఆయన పత్రికా కార్యదర్శి చార్లెస్ జి. రాస్ చెప్పెను.

## గాంధీజీఆదర్శముల కనుగుణంగా అస్సాంలో గ్రామపంచాయతీలు

### రాష్ట్రపంచాయతీ బిల్లుకు గవర్నర్ జనరల్ ఆమోదం

గౌహతి, నవంబరు 27: అస్సాం రాష్ట్ర శాసనసభ గత బడ్జెటు సమావేశంలో ఆమోదింపబడిన అస్సాం పంచాయతీ బిల్లునకు గవర్నరు జనరలు అనుమతి నొసంగెను.

రాష్ట్రంలోగల గ్రామాలు గాంధీజీ ఆదర్శముల కనుగుణ్యంగా స్వయంపోషకములగునట్లు ప్రభుత్వం వాటిని పునర్నిర్మాణం చేయుటకు యీ బిల్లు దోహదపడునంగాను. ఈ చట్టం ప్రకారం 720 గ్రామ పంచాయతీలు ఏర్పాటుచేయబడును.

### బెర్లిను ప్రతిష్టంభన

పారిస్, నవంబరు 29: బెర్లిను ప్రతిష్టంభన తొలగించుటకు గాను అగ్రరాజ్య చతుష్టయమువారికి భద్రతా మండలి అధ్యక్షుడు డా॥ జాన్ బ్రామగ్లియా తన పథకమును నేడు అందజేసెను.

బెర్లినులోని రష్యను దిగ్బంధన క్రమముగా సన్నగిల్లుటకును, నూతన ఆర్థిక విధానము అంతటా ఒకేసారి అమలుజరుగునట్లును ఈ పథకములో సూచనలున్నవని తెలియుచున్నది.

"బెర్లిను సమస్యా పరిష్కారము సాధ్యమని మేము నమ్ముచున్నాము" బెర్లినంతటను తన రాజకీయ, ఆర్థిక ప్రాబల్యము నెలకొల్పుటకు నష్యాప్రభుత్వము చేయుచున్న ప్రయత్నమును ఆపుచేయు పద్ధతులను భద్రతా మండలి కనిపెట్టు ఆశ కలదు అని అమెరికా రాయబారి నాయకుడు డ. క్సె అమెరికాకు రేడియో ద్వారా తెలిపెను.

కొత్త ఆర్థికవిధానము వివరములు నిర్ణయించుటకు భద్రతామండలి అధ్యక్షుడు ఒక ప్రవీణుల సంఘము నియమించబడి, నాలుగు అగ్రరాజ్యములవారు రావలెననియు అగ్రనచో పని వెంటనే ఆరంభించబడును. అగ్ర రాజ్య చతుష్టయమువారి సమ్మతి మరిగత వారము లోపుగా లభించవచ్చునని నమ్ముచున్నారు.

విషిన్‌స్కీ ఆర్థిక విధానమును గురించి బ్రామగ్లియాతో చర్చించి యుండెనట. ప్రవీణుల నిర్ణయములు పూర్తికాగానే బెర్లినులో నాలుగు దేశముల వారును తాము అమలుజరుపుచున్న నిర్బంధములను ఎత్తివేయుదురు. పశ్చిమ దేశములవారు సోవియట్ మార్కు నాణెమును చలామణీలోనికి తెచ్చుటకు రష్యా నిర్ణీతకాలములో ప్రసాదాదుల సరఫరాను ఎత్తివేయును.

## "వీటో" అధికార భవిష్యత్తుపై వచ్చేవారం సమితిలో చర్చ

పారిస్, నవంబర్ 28: భద్రతామండలిలో వీటో అధికారమును (అధికసంఖ్యాకులు ఆమోదించిన అంశాలను అగ్రరాజ్యాలలో ఎవరయినా తోసిపారవేసే అధికారం) ఉంచటమా తొలగించటమా అన్న అంశంమీద వచ్చే వారం ఐక్యరాజ్యసమితిలో తీవ్ర చర్చ జరుగబోతున్నది. వీటో అధికారమును ఎట్టి పరిస్థితిలోనయినా ఉంచవలసినదేనని రష్యన్ ప్రతినిధులు ముందే తమవైఖరిని స్పష్టపరిచివున్నారు. కిందటివారం ఆండ్రీ విషిన్‌స్కీ తాత్కాలిక అదనపు రాజకీయసంఘంలో, కొత్తదేశాలకు సమితిలో సభ్యత్వం ఇచ్చేవిషయమై ప్రసంగిస్తూ, వీటో అధికారం అల్పసంఖ్యాకులకు ఆశ్రయమిచ్చే దుర్గం వంటిదని, అగ్రరాజ్యాలు కుట్రలు పన్నటం మానేవరకూ రష్యా దానిని ఉపయోగిస్తూనే వుంటుందనీ స్పష్టపరిచెను.

మొత్తానికి ఈ వీటోను ఉపయోగించటంలో పెద్దరాజ్యాలు పోటీపడి సమితిలోని చిన్నరాజ్యాలన్నిటికీ విసుగెత్తిపోయినది. ఈ అధికారం దుర్వినియోగం కాకుండా తగిన ఏర్పాట్లు వుండాలని వారు కోరుతున్నారు. ఈ అధికారాన్ని గురించి చర్చించటానికి ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశము ఒక తీర్మానమును ఏర్పరచవలెనని ఆర్జెంటీనా ప్రతిపాదించి వున్నది.

తాత్కాలిక అదనపు రాజకీయసంఘం రేపు సమావేశమై, ఆర్జెంటీనా తీర్మానమును, భద్రతామండలి కార్యనిర్వహణం విషయమై సమితి ఉపసంఘం సమర్పించిన నివేదికనూ, అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్, చైనాలు ఈ విషయమై సమర్పించిన సంయుక్త ప్రతిపాదననూ చర్చించును. (అ. యు. ప్రె.)

### సర్దార్ పటేలు

న్యూఢిల్లీ, నవంబరు 28: భారత ఉపప్రధాని సర్దార్ పటేలుగారు నేటి ఉదయము అలహాబాదు నుండి ఢిల్లీకి తిరిగి వచ్చిరి. (అ. ప్రె.)

## కలకత్తాలో శ్రీ రాజాజీ

కలకత్తా, నవంబరు 28: భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు నేటి మధ్యాహ్నం విమానములో ఢిల్లీనుండి కలకత్తా వచ్చిరి. ఇచ్చట వారు మూడు రోజు లుందురు. (అ. ప్రె.)

## "అమెరికా ఆటంబాంబులను నమ్ముకొన్నందువల్ల లాభంలేదు"

### చైనా అంతర్యుద్ధంపై బ్రిటిషు పార్లమెంటు కార్మికపక్షసభ్యుడు క్రాస్‌మన్ వ్యాఖ్య

లండన్, నవంబరు 28: బ్రిటిషు పార్లమెంటులోని కార్మికపక్ష సభ్యుడగు రిచర్డు క్రాస్‌మన్ "సండే పిక్టోరియల్" అను పత్రికలో యిట్లు వ్రాసెను:

చైనాలో ప్రభుత్వపక్ష సేనలకు అమెరికావారి విమానదళముల సహాయము కలదు. అమెరికను టాంకులు పైటర్లు తీవ్రంగా పోరాడుచున్నవి. కాని అంటి కమ్యూనిస్టుసేనలకు ఒక్క విమానంకూడా లేదు, అయినప్పటికీ కమ్యూనిస్టు సేనలే గెల్చుచున్నవి. కాబట్టి అమెరికావారి విమానబలమున్ను, ఆటంబాంబులున్ను మనలను రక్షించగలవనే భ్రమలో నుండరాదు. నిజమైన కమ్యూనిస్టు తత్వము యొక్క బలమును ఎదిరించుటకు ఆటంబాంబు అక్కరకు రావు. ఆటంబాంబులను తయారుచేయుచుండుట వల్ల అవి మనలను రక్షించగలవనే భ్రమలో ప్రజాస్వామ్య రాజ్యాలవారు జీవించుచున్నారు. అసలు యీ ఆటంబాంబులను తయారు చేయకుండా వుండినట్లయితే బాగుండేది. అట్టి భ్రమలేకుండా దీనికిబదులుగా కమ్యూనిజమునే కట్టుదిట్టం చేసియుండెడివారము.

### మార్షలు సహాయము

వాషింగ్టను, నవంబర్ 27: గత బుధవారముతో పూర్తియైన వారములో మార్షలు పథకముక్రింద 16 దేశములకు చేయబడిన సహాయము మొత్తము 17, 62, 83, 721 డాలర్లు. ఇందులో నెదర్లాండు ఈస్టిండీలకు 74 లక్షలునూ, చైనాకు 230 లక్షలునూ ఇవ్వబడెను.


What's in a NAME?
పేరులో ఏముంది?
చాలాఉంది - ముఖ్యంగా ఒక గడియారం కొనవలసి వచ్చినప్పుడు, వెస్టెండ్‌వాచ్ కంపెనీవారు తమ పేరుకు, దెబ్బది ఏండ్లనుండి విఖ్యాతమైన ప్రఖ్యాతికి, గర్వపడుతున్నారు. ఏమంటే, "వెస్టెండ్" గడియారాలు ఇండియాలో వాడుకకు ప్రత్యేకంగా డిజైనుచేయబడ్డవి. మీ వెస్టెండ్ గడియారానికి మీరు చెల్లించు డబ్బుకు, దగ్గిన ప్రతిఫలము పొందుతున్నారు.
ఎక్స్‌ప్రా రెక్టాంగులర్
వెస్టెండ్ పేటెంటు ఎయిర్‌ప్రూఫ్ స్టీల్ రు. 157
స్టాకులు వున్నంతవరకు ఆర్డర్లు నిర్వహింపబడును.
వెస్టెండ్‌వాచ్ కంపెనీ, బొంబాయి & కలకత్తా.
West End Watch Co.
BOMBAY CALCUTTA

"CAUVERY BRAND" BLEACHING POWDER
CaOCl₂

మెట్టూర్ కెమికల్ అండ్ ఇండస్ట్రియల్ కార్పొరేషన్ లిమిటెడ్.
మెట్టూర్ డాం, దక్షిణయిండియా
మేనేజింగ్ ఏజంట్లు: శేషసాయి బ్రదర్సు లి॥ తిరుచిరపల్లి.
సోల్ సెల్లింగ్ ఏజంట్లు: ఆంయిడ్ ఇండస్ట్రియల్ డిస్ట్రిబ్యూటర్సు లిమిటెడ్., 120. అర్మీనియన్‌వీధి, మద్రాసు అండ్ బ్రాంచీలు.



భీమాకు సంబంధించిన అన్ని విషయములకు
హిందుస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సు
కంపెనీ లిమిటెడ్.,
మచిలీపట్టణము.
వారిని
విచారించండి.
ఆపన్నమైన పద్ధతులమీద ప్రజాసేవయే ప్రధానముగా పనిచేస్తున్న
తెలుగు కంపెనీ.
అగ్ని, మోటారు వగైరా భీమాలకు కూడా రిజిస్ట్రీషను పూర్తిఅయి, పని ప్రారంభించుటకు ముమ్మరముగా ఏర్పాట్లు సాగుచున్నవి.
సంవత్సరాంతమునకు క్రొత్త అభివృద్ధి కనపరచుటకు యేజెంటు సోదరులకు హెచ్చరించవలసియున్నది.
భట్లపెనుమర్తి రామకృష్ణారావు,
జనరల్ మేనేజరు.



రు. 25,000 లు గెలవండి
గెలుపు సులభము. పోటీ నెం. H
అంతా సరైన జవాబుకు 1-వ బహుమతి ... రు. 16,000
మొదటి 3 అంకెలు సరిపోయిన జవాబుకు 2-వ బహుమతి రు. 8,000
ఎక్కువ కూపనులు పంపినవారికి రు. 1,000.

| ముగింపు తేది | ప్రవేశరుసుము | ఫలితముల తేది |
|---|---|---|
| 11—12—48 | సింగిల్ కూపన్ రు. 0-8-0<br>3 కూపనులకు రు. 1-0-0 | 21—12—48 |

దీనిలో 5 గదులున్నవి. 2 నుండి 6 వరకు అంకెలు వాడి మొత్తం 20 సంఖ్య వచ్చునట్లు చేయవలెను. ఒక సంఖ్య ఒకసారే వాడవలెను. కరెక్టు సొల్యూషను పుదుక్కోట యూనియన్ బ్యాంకు లిమిటెడ్‌లో డిపాజిటు చేయబడినది.
20
పోటీ రూల్సు ప్రకారము, సాదా కాగితంమీద ఎన్ని కూపనులైనా రుసుముతో పంపవచ్చును. ప్రవేశ రుసుము మణియార్డరు ద్వారా గాని పోస్టల్ ఆర్డర్ ద్వారా గాని మాత్రమే పంపవలెను. మణియార్డరు పంపేటప్పుడు కూపనుతో మణియార్డరు రశీదు పంపవలెను. మణియార్డరు రశీదుతో పంపని కూపనులు అంగీకరింపబడవు. బహుమతులు మంజూరుచేయుటలో మేనేజరు తీర్పు ఖాయము. ఈ పోటీ గురించి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు. వసూలైన మొత్తమును బట్టి బహుమతులు పంచబడును. కరెక్టు అన్సర్సు, బహుమతుల జాబితా కావలసినవారు కూపనులతో పాటు రు. 0-1-6 బిళ్ల పంపవలెను. ఇతర రూల్సు మామూలు.
మీ అడ్రెసు, కూపను, ఇంగ్లీషులో వ్రాయండి.
SAIBABA CONCERNS (A. P.)
Santhanapuram, - - Pudukkottai. S. I.



పూజా కన్సెషన్ - ఏ మాదిరైనా ఎన్నుకోండి - ఒకటే ధర.
స్విస్ మేడ్-ప్లాస్టిక్ బాండ్ అమర్చబడి 3 సంవత్సరములు గ్యారంటీ.
5 రాళ్ళు క్రోం కేసు ... రు 27/8
డిటో రోల్డు గోల్డు .. రు 38/-
7 రాళ్ళు క్రోం .. రు 42/-
డిటో రోల్డు గోల్డు .. రు 43/-
15 రాళ్ళు క్రోం .. రు 55/-
డిటో రోల్డు గోల్డు .. రు 68/-
ఏ 2 రిస్టు వాచీలు ఆర్డరు చేసినా ఒక U.S.A. ఫౌంటెన్ పెన్ ఉచితము.
పోస్టేజి 14 అణాలు అదనము.
① ② ③
YOUNG INDIA WATCH Co., Post Box 6744, CALCUTTA.



ఆకమ్మనిశోభ, సుఖానుభవము, మేరొందిన హిమాని ప్రొడక్టులను క్రమముతప్పకుండ వాడుచున్న ఫలితము.
హిమాని
స్నో & గ్లిసరైను సబ్బు
నవీన అందమును పెంపుచేయును
హిమాని వర్క్సు - కలకత్తా
మద్రాసు ప్రెసిడెన్సీ సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
ఎం. కే. ఏ. అండ్ కంపెనీ, 23, నైనియప్ప నాయకస్ట్రీటు, మద్రాసు


# రెవిన్యూమంత్రికి తిరుత్తని తాలూకా రైతుల విజ్ఞప్తి

తిరుత్తని, నవంబరు 27:

రెవిన్యూమంత్రి కళా వెంకటరావుగారు నేడు కుటుంబసమేతముగావచ్చి శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ఆలయమున పూజాదికములు జరిపిరి. చిత్తూరు జిల్లాకలెక్టరు, చంద్రగిరి, డివిజన్ డెప్యుటీకలెక్టరు, తదితరఉద్యోగబృందము మంత్రిగారికి స్వాగత మిచ్చిరి. ఆలయంలో ఎగ్జిక్యూటివు ఆఫీసరు జి. దొరస్వామి నాయుడుగారు, పరివారము బాజాభజంత్రీలతో ఎదుర్కొని స్వాగతమిచ్చి దేవుని దర్శన మిప్పించిసహస్రనామార్చనలు పూజలు గావింప జేసిరి. తర్వాత రహదారి బంగాళాలో తిరుత్తని జమీన్ రైతు మహాజనసంఘ కార్యదర్శి పి.గోపాలరెడ్డి, పంచాయతిబోర్డు అధ్యక్షుడు డి. మునిరత్నం నాయుడు, ఈ తాలూకా కాంగ్రెసు కార్యదర్శి బాలయ్యశెట్టి మున్నగువారును తాలూకాలోని రైతులశేషులును మంత్రిగారిని సందర్శించి విజ్ఞాపన పత్రములను సమర్పించిరి. తిరుపతి దేవస్థానము ఎస్టేటులోని చెరువులు, చెరువుకట్టలు, బంజరుభూములలో గల చింత, తుమ్మ, దిరిసెనప, మున్నగు చెట్లను కొట్లలుగా తక్కువ మొత్తములకు బొగ్గుల వ్యాపారమునకు కొట్టివేయుటకు యిజారా పద్ధతిని, యిచ్చెడి అలవాటును తక్షణము నిలిపింపవలెనని, పాతశిస్తుబాకీలకై వేలకొలదిగా రైతులమీద కెంటుకోర్టులలో వేయుచుండెడి దావాలను నిలిపింపవలెననియు, జమీందారి రద్దు చట్టమును వెంటనే అమలు జరుపవలెననియు, విద్యుచ్ఛక్తి సరఫరాలను రైతులకు అడ్డులేకుండ యిప్పింపవలెననియు, నూతుల త్రవ్వటకు తిరుత్తని తాలూకాలోని హరిశ్చంద్రపురం, కలకొలూరు గ్రామాదులకు వలె అన్ని ప్రాంతీయ గ్రామాదులకును 750 రూపాయల విరాళముల నిప్పింపవలెననియు సూచించిరి ఈ అన్ని విషయములను మంత్రిగారు సావధానముగ విని అనుకూల పరిష్కారము గావించెదమని సెలవిచ్చిరి. తదుపరి మంత్రిగారు ఇచ్చటికి పదిమైళ్ళదూరమున గల రామనగర్ వ్యవసాయ కేంద్రమునకు వెళ్లి చూచిరి.

# రైతాంగం కోర్కెలు
## బాలిరెడ్డిగారి ప్రకటన

చిలకలూరిపేట, నవంబరు 26: ఆంధ్ర రాష్ట్ర కిసాన్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి చేగిరెడ్డిబాలిరెడ్డిగారు ఈనాటికిరైతు కాంగ్రెసు ఆందోళన ఫలితంగా కొంత వరకు ధరలు పెంచినందులకు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలను రైతాంగము, రైతు కాంగ్రెసు, ఉత్పత్తిదారుల సంఘాల తరపున అభినందించుచు, రైతుకాంగ్రెసు కోర్కె ప్రకారం 2 మణుగుల బస్తాకు కళ్లంవద్ద రు 18 లు రైతుకు ముట్టేటట్లు చేసివున్నట్లయితే మరింత బాగుండేదనీ మెట్టధాన్యాలకుకూడా 47 లో నిర్ణయించిన ధరలకు మూరింట్ల 75 వంతులు పెంచవలయునసెడి రైతాంగపు కోర్కెనుకూడా ఆచరణయందు పెట్టగలరని ఆశ వెలిపుచ్చుచున్నారు. దేశాన్ని ఆహారకొరతనుండి రక్షించి స్వయం సమృద్ధంగాచేయు నుతర బాధ్యత తమపై గలదని రైతాంగం గుర్తించాలని, రైతులకు ఎరువులు, విత్తనాలు, సిమెంటు, కిరోసిను, ఇనుము తదితర వ్యవసాయ పరికరములను విరివిగా కంట్రోలు ధరలకు ప్రభుత్వం సరఫరా చేయాలని కూడ వారు కోరుచున్నారు.

బళ్ళారిజిల్లా పత్రికా రచయితల సంఘం నవంబరు 21 న బళ్ళారిలో సమావేశమైనప్పుడు గత సెప్టెంబరు 15 న కర్నూలులో ఒక పోలీసు ఉద్యోగి ఒక విలేఖరి పై జరిపిన దౌర్జన్యమును గర్హించుచును, నిజాంలో ఇటీవల మోటారు ప్రమాదములో గాయపడిన విలేఖరులకు సానుభూతి సూచించుచును తీర్మానించిరి.

విజయవాడ, కోఆపరేటివ్ సెంట్రల్ బాంకు ఉద్యోగుల రిక్రియేషన్ క్లబ్ ప్రారంభోత్సవము నవంబరు 14 న పేట బాపయ్యగారి అధ్యక్షతను జరిగెను. మహాత్మాగాంధి, పండిట నెహ్రూల ఫోటోలు ఆవిష్కరింపబడెను. క్లబ్ మేనేజింగ్ కమిటీకి అధ్యక్షుడుగ వి. రామస్వామి శాస్త్రి, కార్యదర్శిగ వి. కోటేశ్వరరావుగార్లు ఎన్నికైరి.

కృష్ణాజిల్లా నందిగామ తాలూకా వేదాద్రి గ్రామంలో నవంబరు 15 న బ్రాంచిపోస్టాఫీసు పెట్టబడెను.

తాడేపల్లిగూడెం, నవంబరు 22: ఈ నెల 17 న డా॥ కేతలి సత్యనారాయణమూర్తిగారి అధ్యక్షతను జరిగిన సభలో మండలాంధ్ర సమ్మేళనానికి అధ్యక్షులుగా, సమ్మెలపల్లి వీరభద్రావుగారు ఉపాధ్యక్షుడుగ, దిద్దపాల లక్ష్మీపతి నారాయణయ్యగారు కార్యదర్శిగా, వ. గోపాలకృష్ణ భాషా ప్రయుక్త రాష్ట్రసమితి ఏర్పాటు చేయబడెను.

# చీరాల ఆసుపత్రిలో ప్రసూతి శాల శంకుస్థాపన
## నూనె వెంకటసుబ్బయ్యగారి వితరణ

చీరాల, నవంబరు 27: ఈవూరి మిషన్ ఆసుపత్రిలో అన్నపూర్ణా ప్రసూతి శాల భవన నిర్మాణమునకు నిన్న శంకుస్థాపన జరిగెను. ఈ సందర్భమున డాక్టరు కురి వెళ్ళ థామస్ అధ్యక్షతను జరిగిన బహిరంగసభలో టి. రాజగోపాలయ్యంగారు ఈ శాలానిర్మాణమునకు రు 10,000/- లు విరాళ మిచ్చిన నూనె బుర్రయ్యగారి కుమారుడు వెంకట సుబ్బయ్య శ్రేష్ఠిగారి వితరణను ప్రశంసించి వారికి ఒక సన్మాన పత్రమును సమర్పించిరి. కె. వరదాచారిగారు కూడ ప్రశంసించుచు మాట్లాడిరి. డాక్టరు జె. రామారావు, పూటుకూరి రామయ్య శ్రేష్ఠిగార్లు మొదలైనవారు వెంకట సుబ్బయ్యగారి వదాన్యతను మిషన్ ఆసుపత్రి అధికారులు రోగులకు చేయుచున్న సేవను కొనియాడుచూ, బీదలకు ఉచితసేవ ఏర్పాటుచేయమని విన్నవించుచు, ఉపన్యసించిరి.

వెంకట సుబ్బయ్యగారు సమాధాన మిచ్చుచు తమ ధర్మమును నిర్వర్తించిరని ఇందులో పొగడవలసిన దేమీ లేదనిరి. ఈపనిలో ప్రోద్బలముచేసిన అయ్యంగారికి ధన్యవాదము లర్పించిరి.

ఆసుపత్రిలో అధికారుల తరపున సూపరింటెండెంటు మిస్. యం. ఎ. హెచ్. మేరీ, సుబ్బయ్యగారి ఔదార్యమునకు ధన్యవాదము లర్పించి ఆ కట్టడమునకు మిషన్‌వారు మరి రు 10,000 ఇచ్చింపవలరని, ఆసుపత్రిలో ఎక్స్‌రే అవసరమని గ్రామస్తులు సహకరించవలెనని విజ్ఞప్తి చేసిరి.

అధ్యక్షుని ఉపసంహారోపన్యాసానంతరము అతిథులకు పండ్లు తాంబూలములు పంచిపెట్టబడెను. నాగారపు చెంచయ్యగారి ధన్యవాద సమర్పణముతో సభ ముగిసెను. (స్వ. వి.)

# గుంటూరు పట్టణ మహిళా సభ

గుంటూరు, నవంబరు 26: గుంటూరు పట్టణ మహిళామహాసభ మొన్నను శ్రీమతి రుక్మిణి ప్రభాకరరావుగారియొక్క అధ్యక్షతను జరిగెను. ప్రార్థనానంతరం కార్యదర్శిని గతసంవత్సరపు నివేదికను చదివిరి. కొండా పార్వతీదేవి వంగలూరి రాజ్యలక్ష్మమ్మ, బొడ్డుపల్లి బాలాత్రిపురసుందరమ్మ, తురగా మాణిక్యాంబగార్లు తదితరులు ఆంధ్రరాష్ట్ర విషయమును గూర్చియు, సంఘ సేవనుగూర్చియు, స్త్రీలబాధ్యతలను గూర్చియు మాట్లాడిరి.

అధ్యక్షురాలి ఉపన్యాసములో పూర్వకాలమున స్త్రీల ఔన్నత్యమును గూర్చి స్వతంత్ర భారతదేశములో స్త్రీలు చేయవలసిన పనులుగురించి తెలిపిరి. క్రొత్తసంవత్సరమునకు అధ్యక్షురాలుగ శ్రీమతి రుక్మిణి ప్రభాకర్ రావు, ఉపాధ్యక్షురాలుగ కొండా పార్వతిదేవి కార్యదర్శినిగ తురగా మాణిక్యాంబ సహాయ కార్యదర్శినిగ పి. చెల్లమ్మగార్లు ఎన్నికైరి.

# హొసపేటలో ప్లేగు

హొసపేట, నవంబరు 23: ఇచ్చట ప్లేగు ఉన్నందున మునిసిపల్ అధికారులు కాఫీహోటళ్లు ఉదయం 10 గంటలతర్వాత కట్టివేయవలెనని, మధ్యాహ్నం 2 గంటల నుండి సాయంత్రం 6 గం. వరకే తెరచి ఉంచాలని ఉత్తరువు చేసిరి.

# అనంతశయన గుడి పునరుద్ధరణ

హొసపేట, నవంబరు 23: విజయనగరంరాజులనాటి అనంతశయన గుడిని ప్రస్తుత జీర్ణస్థితినుండి ఉద్ధరించుటకు ప్రభుత్వం పూనుకొన్నట్లు తెలియుచున్నది. గుడి ప్రాకారమునందు ఇండ్లు కట్టుకొన్నవారందరికి ప్రభుత్వం, ఆ ఇండ్లను తొలగించవలెనని, అందుకు తగు పరిహారమిచ్చెదమని తాఖీదు పంపెను.

# మదరాసు రేడియో
## డిశంబరు 1 బుధవారం

మదరాసు 2:

7 గ. స్వాగతం. 7-10 తె. వార్తలు. 7-20 రికార్డులు. 7-30 పి. వి. యజ్ఞనారాయణ కీర్తన. 8 ఇ. వార్తలు. 8-15 టాకీ రికార్డులు. 8-30 కె. ఆర్. నాగభూషణం రామచంద్రనుపాట. 12-30 హైస్కూళ్ళకు (అరవం) 1 గ. మెదక్ నిగడి. 1-30 ఇ. వార్తలు. 2-5 తె. వార్తలు. 2-15 హైస్కూళ్ళకు తెలుగులో సంభాషణ, ప్రసంగం. నాయకి సన్నివేశం. 2-45 రికార్డులు. 4 స్త్రీలకు ఇంగ్లీషులో 4-30 ఇ. నాయిద్యం. 5-30 విజయవాడనుండి 6 ఇ. వార్తలు 6-30 విజయవాడ కార్యక్రమం. 9-15 ఇ. ఉపన్యాసం. తరువాత విజయవాడ కార్యక్రమం.

# పట్టాభిగారి జన్మదినోత్సవాలు
## విజయవాడలో ఉత్సవముల వివరాలు

విజయవాడలో పట్టాభిగారి జన్మదినోత్సవములు షుమారు 50 చోట్ల జరుపబడెను. సిటి కన్వేయన్సు లేబరు యూనియన్‌వారు మధ్యాహ్నం కార్మిక లైబ్రరీవద్ద నుండి పట్టాభిగారి విగ్రహమును రథముపై ఉంచి 69 రెండెడ్లబళ్ళతో పెద్ద ఊరేగింపు జరిపిరి. 69 మందికి వస్త్రదానము చేసిరి. వుదయం కార్మిక నాయకుడు రాంబ్లెస్ పేరు అప్పలస్వామిగారి పేర ఒక గ్రంథాలయము స్థాపించిరి. చిట్టిగారి అధ్యక్షతను ఏర్పడిన కమిటీవారు పట్టాభిగారి పటమును బండిమీద వూరేగించిరి. సాయంత్రం సాధీరంగం చౌకునందు బసవరాజు శ్రీరంగరాయిగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. పలువురు వుపన్యసించిరి. స్థానిక జూయలర్సు బులియన్ మర్చంట్సు ఎసోసియేషనువారు కూడా ఒక సభజరిపిరి.

చిత్తూరులో పట్టణ, తాలూకా, జిల్లా కాంగ్రెసు సంఘముల యాజమాన్యమున ఆర్. వెంకటరెడ్డి (యమ్. యల్. ఎ.) గారి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. పట్టాభిగారి దేశసేవగురించి డి. శ్రీనివాస అయ్యంగార్, ఎస్. విశ్వనాథం, సుబ్ర వెంకటరత్నం నాయుడు, నాగా నరసింహులు నాయుడుగార్లు ఉపన్యసించిన పిమ్మట శ్రీ వారికి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి కలుగునట్లు భగవంతుని ప్రార్థించుటతో సభ ముగిసెను.

ఎమ్మిగనూరులో ఆంధ్రసంఘము ఆధ్వర్యమున మాచాని సోమప్పగారి అధ్యక్షతను సభజరిగెను. బి. హనుమంతరావు, జి. యం. గంగన్న, శివరావుగార్లు, 'పట్టాభి' గారి, దేశసేవ, సుగుణములు గురించి ముచ్చటించిరి. సంఘ కార్యదర్శి సత్యనారాయణ శెట్టిగారి వందనములతో సభ ముగిసెను.

కర్నూలులో కే. వి. కృష్ణమూర్తిరావుగారి అధ్యక్షతను పట్టణ కాంగ్రెస్ సమావేశం జరిగెను. జి. కే. శ్రీ గిరిరావుగారు పట్టాభిగారి జీవితము గురించి ఉపన్యసించిరి.

పట్టాభి రాష్ట్రపతిగా ఎన్నుకోబడినందులకు హర్షిస్తూ వారికి ఇతోధిక ఆయురారోగ్యములు కలుగవలెనని భగవంతుని ప్రార్థించుచును, వారి నాయకత్వమున కాంగ్రెసు సంస్థలలోని (ముఖ్యముగా ఆంధ్రరాష్ట్రములో) లోపములు సత్వరమే సవరింపబడి మునుపటి మాదిరిగ కాంగ్రెసు సంస్థలు ప్రజల విశ్వాస ఆదరాభిమానములు చూరగొనవలెనని ఆశించుచును తీర్మానించిరి.

ఆదోనిలో టి. జి. తిమ్మయ్యగారి అధ్యక్షతను సభజరిగెను. పట్టాభిగారిని గురించి మహోన్నత ఆశయాలను తు. చ. తప్పకుండా జాతీయ రథమును నడుపగల మహారథుడని టి. రామమూర్తి కే. ఎల్. ఎన్. సోమయాజులు, వేంకటశాస్త్రి, ఎం. అరళప్పగార్లు ఉపన్యసించిరి.

అనంతపురంతాలూకా సనప గ్రామ రైతు కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగ ఉమ్మడి, చిన్న వెంకటప్ప, కార్యదర్శిగ ఎ. ఎల్. నరసింహం, కోశాధికారిగ మేసం కరిబసప్పగార్లు ఎన్నికైరి.

గుంటూరు మునిసిపల్ స్పెషలాఫీసరు ఎస్. కృష్ణయ్యశెట్టిగారు నవంబరు 20 న ఆపట్నంలోని జాతీయ పాకీపనివాండ్ల సంఘం ఆవరణలో పతాకప్రతిష్ఠ జరిపిరి.

తెనాలి తాలూకా మోపర్రుగ్రామంలో ఈ నవంబరు 14-న గాంధీ, కస్తూరిబా, నెహ్రూ, నేతాజీల శిలావిగ్రహ ప్రతిష్ఠలు జరిగెను.

గుంటూరుజిల్లాలో ఇప్పటివరకు 550 మంది రాజకీయబాధితులకు భూములివ్వబడినవని, మిగిలినవారికందరికిని యీనెలాఖరులోగా యివ్వబడునని సలహాసంఘ సభ్యుడు కల్లూరి రామయ్యగారు తెలియజేసిరి.

తెల్లదేవరపల్లెలో, నవంబరు 15 న క్విట్టిండియా; 'ఢిల్లీకోటా' వ్యాసేక గ్రంథకర్తలును, సరసకవికోకిలయు కాంగ్రెసు వాదులునగు ప్రత్తిపాటి రాఘవరాజుగారిని, కొందరు అగనూటపవారు రూపాయల్ని సగౌరవ సత్కరించిరి.

చీరాల, నవంబరు 19: బాపట్ల, ఒంగోలు తాలూకాల మగ్గంమిల్లుల యజమానులు నిన్న చీరాలలో కొల్లా శ్రీరాములుగారి అధ్యక్షతను సమావేశమై డా॥ పట్టాభి సీతారామయ్యగారు రాష్ట్రపతిగ ఎన్నుకోబడినందుకు అభినందనలు తెలుపుచూ తీర్మానించిరి. ఆపైన మగ్గం మిల్లుల యజమానుల సంఘమును ఏర్పరచుకొని దానికి కొల్లా లక్ష్మీనారాయణగారు అధ్యక్షులుగను, కోలా శేషయ్యగారు కార్యదర్శి, కోశాధికారిగను ఎన్నుకొనబడిరి.


Healthy Teeth... and a grand smile
ఆ చిరునవ్వును నిలుపవలెనన్న దయచేసి సాయంత్రము 'థైమోసిన్' పుక్కిలించినట్లయితే నోటి దుర్వాసన మటుమాయమగును. థైమోసిన్ మీ పండ్లను ఉజ్జ్వలముగా వుంచడమే కాదు, అది మీ పండ్లను, దంతక్షయవ్యాధి మొదలైన వాటి నుండి కాపాడును. దంతములు, చిగుళ్లలోని అనేకవిధములైన జబ్బులను నివారించును.
For Oral Thymocin Hygiene
టి. ఎం. ఠాకూర్ & కంపెనీ, 48, బర్వాలేట్ స్ట్రీటు, బొంబాయి.



ఇండియన్ బ్యాంక్ లిమిటెడ్.
హెడ్డాఫీసు: మద్రాసు.
లోకల్ ఆఫీసులు:
ఎస్ప్లనేడ్, ఎగ్మూరు, ట్రిప్లికేన్, మౌంట్ రోడు, రాయపేట, మైలాపూరు, త్యాగరాయనగరు: పురుషవాకం, రాయపురం, మద్రాసు ప్రెసిడెన్సీలో అన్ని ముఖ్యమైన తావులందును, కొలంబోలోను బ్రాంచీలు సబ్ ఆఫీసులు కలవు.

| | |
|---|---|
| జారీచేసి చందావెసిన మూలధనము | రు. 72,00,000 |
| అధీకరించిన మూలధనము | రు. 58,00,000 |
| రిజర్వుఫండ్ | రు. 62,00,000 |

అన్నిరకముల బ్యాంకింగు వ్యవహారము చేయబడును.
ఎన్. గోపాల అయ్యర్, సెక్రటరీ.



Fabric for the Fabulously Wealthy
మునుపటిరోజులలో ఎక్కువదర్జా ఒకపోట ఉన్నదన్నుకొనిన దొంగల నుండి కాపాడ వేచియుండు దర్పనీ గాఢ మన్ననలనిచ్చే చేస్తారు... తయారు చేయటానికి ప్రస్తుతం మనకు వీలుకాదు...
KRISHNA Suitings & Shirtings
Manufactured by
SRI KRISHNA WEAVING MILLS, SUBRAMANYAPURA, BANGALORE CITY.
SOLE DEALERS: VADALAM BROTHERS, LTD., BANGALORE CITY.



జేమ్సు
కారల్టన్ లిమిటెడ్.
దిగుమతి సుంకములు పెరిగినందున
సిగరెట్లు, పుగాకుల ధరలు మార్చబడినవి.
సిగరెట్లు:-

| | | | |
|---|---|---|---|
| కారల్టన్సు స్పెషల్ (మాగ్నమ్సు, స్టాండర్డు, గోల్డుటిప్డు) | 50 కి | రు. | 3 9 0 |
| కారల్టన్సు స్ట్రెయిట్ వర్జీనియా | 50 కి | రు. | 2 6 0 |
| డిటో | 10 కి | రు. | 0 7 6 |
| చెల్సీ | 50 కి | రు. | 2 3 0 |
| డిటో | 10 కి | రు. | 0 7 0 |
| ఒమేగా | 50 కి | రు. | 1 9 0 |
| డిటో | 10 కి | రు. | 0 5 0 |
| డీలక్సు పెనాంట్ | 50 కి | రు. | 1 9 0 |
| డిటో | 10 కి | రు. | 0 5 0 |
| రెడ్‌సీల్ (సాదా లేక కార్కుటిప్డు) | 50 కి | రు. | 1 4 0 |
| డిటో | 10 కి | రు. | 0 4 0 |
| విక్టోరియన్ | 10 కి | రు. | 0 4 0 |
| నంబర్ టెన్ వర్జీనియా | 50 కి | రు. | 0 15 0 |
| డిటో | 10 కి | రు. | 0 3 0 |

పుగాకులు:-

| | | | |
|---|---|---|---|
| కారల్టన్ మిక్స్చర్ | 2 ఔ॥ టిన్ | రు. | 2 6 0 |
| కారల్టన్ కోర్సు కట్ | 2 ఔ॥ టిన్ | రు. | 2 13 0 |

అమలులో వున్న చోట స్థానికపుపన్ను అదనము.

# ఉబ్బసము

ఏర్మన్ కెమిస్టు డాక్టర్ కే. గోల్డుస్మిత్ చే తయారైన

## పల్మొడాల్ విత్ ఎఫిడ్రిన్

ఉబ్బసమునకు దివ్యౌషధము. రెండు చెంచాల మందును సేవించిన వెంటనే ఆయాసము తగ్గి మందును. అన్ని మందుషాపులలోను దొరుకును. 6 ఔన్సుల సీసా 1-8 పోస్టేజి 12-0.

ది బెజవాడ కమ్మర్షియల్ కార్పొరేషన్, సూర్యారావుపేట - బెజవాడ. (సోల్ ఏజంట్లు).

WELCOME

బళ్ళారిజిల్లా:
సేత్ ప్రేంరాజ్ పృథ్వీరాజ్
బల్డువా సి. బి. బళ్ళారి.
మాన్యుఫాక్చరర్లు;
ది హూచ్ కార్పొరేషన్ ఆఫ్
మద్రాస్, శివకాశి. (యస్.ఐ.రైల్వే.)

# భవిష్యత్తుకు క్లెయిము

భవిష్యత్తుకు ముక్కుపచ్చలారని యీ పసికిడ్డ క్లెయిము సులకనగానే వుంటుంది, దానిని తండ్రి విధిగా నెరవేర్చి తీరవలెను. ఎదిగెడు బిడ్డ, తగినట్టుగా ఫలము పొందుటకు అతనిని బహుజాగ్రతగా సుభద్రముగాను పెంచవలెను ఈ నియమము సరియైన జీవిత బీమా పాలిసీ ద్వారానే తప్పక నెరవేరును.

# రూబీ జనరల్

ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్.

జీవితము, అగ్ని, నౌక, ప్రమాదములు, ఎయిర్ క్రాఫ్టు, విమాన ప్రయాణీకులు, మోటారు బండ్ల మొదలగు అన్ని రిస్కులకు బీమా వ్యాపారము చేయబడును.

హెడ్ ఆఫీసు: 21. దర్యాగంజ్, ఢిల్లీ.

మద్రాసు ఆఫీసు : 337, తంబుచెట్టి వీధి, జీ. టి.

కోయంబత్తూరు ఆఫీసు : టవర్ బిల్డింగు, వెరైటీ హాల్ రోడ్.

తమిళనాడు ఆఫీసు : 17. చిన్నక్కడై వీధి, తెప్పకులం పోస్టు, తిరుచ్చినాపల్లి.

సిలోను కు చీఫ్ ఏజంట్లు : చిమన్ లాల్ దేశాయ్ & కో., పోస్టుబాక్సు నెం. 374, మజాహూర్ బిల్డింగు, మెయిన్ వీధి, కొలంబో.

ఆంధ్రజిల్లాలకు చీఫ్ ఏజంటు : శ్రీ వి హెచ్. వి. రామన్, గవర్నరుపేట, బెజవాడ.

రు 22/8- సెంటర్ సెకండు వాచ్ ఉచితము

అపూర్వమైన రిస్టువాచీలు, ఖచ్చితమైన మెంటు, అందమైన ఆకారములు, క్రొత్తమోడలు, స్విస్ మేడ్, ప్రతిది 3 ఏళ్ల గ్యారంటీ.

రౌండ్ క్రోం కేసు 18/8, సెంటర్ సెకండ్ 22/8 ఫ్లాట్ షేపు 4 రాళ్ల క్రోం 23/- చిన్న సైజు 25/- 7 రాళ్ల క్రోం కేసు 27/- రోల్డు గోల్డు 36/- 15 రాళ్ల క్రోం కేసు 32/- రోల్డుగోల్డు 48/-

రెక్టాంగ్యులర్ నవ్యఫాన్సీ (బొమ్మలో మాదిరి) 5 రాళ్ల క్రోం కేసు 30/- రోల్డుగోల్డు 35/- 7 రాళ్ల క్రోంకేసు 37/- రోల్డుగోల్డు 48/- 15 రాళ్ల క్రోం కేసు 52/- రోల్డుగోల్డు 80/- అలారం టైంపీసు 18/- మేలి 22/- పెద్ద 25/- పోస్టేజి అదనము- 3 రిస్టువాచీలు ఒకసారి కొనువారికి రు 22/8- రిస్టువాచి ఉచితము.

H. DAVID & Co.,
Post Box No. 11424, calcutta.

సుధాను ప్రోపిటర్లు: ఎం. పేస్. 2/3, ఎంపరర్ రోడ్, మద్రాసు.


# సోవియట్ రాజ్యాంగములో స్త్రీలకు,పిల్లలకు విశిష్టస్థానం

## శ్రీమతి విజయలక్ష్మి వివరణ

న్యూయార్కు, నవంబరు 27 : సోవియట్ యూనియన్లో పిల్లల సుఖసంతోషాలకూ, వారి అభివృద్ధికీ ఇవ్వబడుతున్న శ్రద్ధను ఐక్యరాజ్యసమితిలో భారత ప్రతినిధివర్గ నాయకురాలు శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ నేడు ప్రశంసించినది. అమెరికా ప్రజల ఉపయోగార్థం అమెరికన్ బ్రాడ్ కాస్టింగ్ కంపెనీవారు శ్రీమతి విజయలక్ష్మి, మిసెస్ ఎలినార్ రూజ్వెల్టులకు పారిస్ రేడియోలో ఏర్పరచిన సంభాషణలో ఆమె ఈ ప్రశంస చేసినది. రష్యాలో స్త్రీలకు పురుషులతో సకల విషయాలలోనూ సమాన హక్కులున్న అంశాన్ని ఆమె తెలియజేసి, భారతమహిళల ఆదర్శంకూడా అదేనని చెప్పినది.

"రష్యానుగురించి మాట్లాడటం చాల కష్టం. ఎందువల్లనంటే అక్కడజరిగే విషయాలు సులభంగా తెలియవు. కాని నేను చూసినంతవరకూ, అక్కడ జరుగుతున్న విషయాలు చాల ప్రశంసించ తగినవిగా ఉన్నవి. ముఖ్యంగా చిన్నపిల్లల అభివృద్ధికై రష్యాలో చూపబడుతున్న శ్రద్ధను ఎంతయినా మెచ్చుకోవలెను. అన్ని విషయాలలోనూ వారి అభివృద్ధికే ప్రాధాన్యత ఇవ్వబడుతున్నవి. రష్యాలో మరొక చెప్పుకోతగ్గవిషయం అక్కడి స్త్రీలకు అన్ని విషయాలలోనూ పురుషులతోగల సమానత్వం. మాస్కో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి శాలకు ఒక స్త్రీ ముఖ్యాధికారి. ఆమె క్రింద అనేక వందలమంది పనిచేయుచున్నారు." అని ఆమె వివరించినది. ఆమె గత 25 సం||లలోనూ భారత మహిళల అభ్యుదయాన్ని వివరించినది.

# రూజ్వెల్ట్ సతిపై 'ఇజ్వెస్టియా' విమర్శ

మాస్కో, నవంబరు 27 : సోవియట్ ప్రభుత్వ పత్రిక 'ఇజ్వెస్టియా' నేడు మిసెస్ ఎలినార్ రూజ్వెల్టును ఒక ఈగతో పోల్చినది. ఐక్యరాజ్యసమితి మానవహక్కుల సంఘం ఎదుట ఆమె మాట్లాడుతూ "సోవియట్ రాజ్యాంగంలో ప్రజల హక్కుల గురించి వ్రాయబడినదంతా కేవలం విదేశాలలో ప్రచారం నిమిత్తమే. నిజానికి అక్కడి ప్రజలకు హక్కులేమీ లేవు" అని చెప్పినదానిపై విమర్శిస్తూ ఈ పోలిక నీపత్రిక పెట్టినది.

"అతి విస్తృతమైన హక్కులతో కూడిన సోవియట్ రాజ్యాంగం సూర్యునివలె ప్రకాశిస్తున్నది. ఆ సూర్యుడిని మిసెస్ రూజ్వెల్టువంటి వ్యక్తులు కప్పి ఉంచలేరు. ఒక ఈగ సూర్యగ్రహణం తెప్పించగలదా ?" అని ఆ పత్రిక వ్రాసినది. (అ. యు. ప్రె.)

# భారతదేశంలో కాశ్మిక కిరణ పరిశోధన

బొంబాయి, నవంబరు 27 : కాస్మిక కిరణముల పరిశోధన విషయములో క్రొత్త మార్పులు అభివృద్ధులు భారత దేశములో జరుగనున్నవి.

బర్మింగుహాం నగరమునందు జరిగిన అణుశక్తి పరిశోధన అంతర్జాతీయ సభకు ఆహ్వానింపబడినవారైన డా|| భాభా గారు ఇల్లి తిరిగివచ్చిరి. వీరు పదార్థ మూలతత్వ పరిశోధనకై నెలకొల్పబడిన టాటా పరిశోధనాలయమునకు డా|| భాభా గారు డైరెక్టరుగా నున్నారు. కాస్మిక కిరణముల గూర్చియు పరమాణు తత్వమునుగూర్చియు యితర దేశములలో జరుగుచున్న పరిశోధనలను వీరు చూచివచ్చిరి. ప్రొఫెసరు జి. పి. యస్. ఓకియాలినీగారిని వీరు ఇండియాకు ఆహ్వానించిరి. ఓకియాలినిగారు ప్రొఫెసరు పవేలుగారితో కలిసి ఇటీవల క్రొత్త విషయములను కనిపెట్టిరి. మూలతత్వ పరిశీలనలో ఇవిచాలా ముఖ్యమైనవి. ఓకియాలిని గారు ఇండియాకు 1949 సంవత్సరారంభములో వచ్చి ఇచ్చట కొన్ని మాసముల వరకు ఉండి టాటా పరిశోధనాలయములో పని చేయుదురు.

# భారత ప్రభుత్వ కస్టమ్సు ఆదాయము

కలకత్తా, నవంబరు 27 : 1948 సం|| అక్టోబరు మాసములో సముద్రము పైనను, భూమిపైనను ఎగుమతి దిగుమతియైన వస్తువులపై విధించిన కస్టమ్సు పన్నుల మూలమున భారత యూనియనులో 8 కోట్ల 67 లక్షల రూపాయలు వసూలయ్యెను. దీనిలో దిగుమతి సుంకములవల్ల 7 కోట్ల 1 లక్ష రూపాయలు, ఎగుమతి సుంకములవల్ల 1 కోటి 57 లక్షలు, భూకస్టమ్సువల్ల 9 లక్షలు వసూలయ్యెను. ఆ మాసములోనే మోటారుస్పిరిట్ కిరసనాయిలు, పొగాకు, నిప్పు పెట్టెలు మున్నగువానిపై కేంద్ర ఎక్సైజు పన్నుల ద్వారా 3 కోట్ల 57 లక్షల రూపాయల ఆదాయము లభించెను. (అ. ప్రె.)

# "భాషారాష్ట్రములు అత్యావశ్యకము"

## అధివేశ శాసనసభాధ్యక్షుని అభిభాషణ

సూరత్, నవంబరు 27: భారత యూనియను ప్రభుత్వ పార్లమెంటు అధ్యక్షుడగు జి. వి. మవ్లంకరుగారు సూరతు వాణిజ్య మండలి జరిపిన సన్మానసభలో ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి.

ప్రజా స్వాతంత్ర్య రాజ్యములో ఓటింగు హక్కు అనేది ఒక సాధన విధానము. విద్యాధికులని చెప్పబడేవారుకూడా రాజ్యాంగ విషయములలో కొంత శిక్షణమును జ్ఞానోదయమును పొందవలెను. తమ ఓట్లను వివేకవిచక్షణములతో ఉపయోగింపగలిగినవారై యుండవలెను. సంఘము యొక్క స్వభావ స్వరూపము పూర్తిగా మార్పు పొందిననే తప్ప మన ప్రభుత్వవిధానములు బాగుపడవు. యుక్త వయస్కుడైన ప్రతి పౌరునకు ఓటింగు హక్కు ఇచ్చుటవల్ల ప్రమాదములు ఉండబోవు గాక. కాని ప్రజాస్వాతంత్ర్య ప్రభుత్వ విధానమును అమలుపరచుటకు ప్రజలలో ప్రబోధమును కల్పింపగలుగునది సార్వజనిక ఓటింగు హక్కు.

భాషారాష్ట్రముల విషయములో అధికారబాధ్యతగలవారు స్పష్టముగా తమ నిర్ణయమును వెల్లడించి, భాషావిభేద ప్రాంతములనుబట్టి రాష్ట్రముల పరిహద్దులు నిర్ధారణ చేయబడునని చెప్పవలెను. క్రొత్తరాజ్యాంగవిధానముయొక్క చిత్తుముసాయిదాలో భాషారాష్ట్రములను నిర్ణయించి ఏర్పాటుకు వీలున్నది. ఈ భాషారాష్ట్ర నిర్మాణమును ఇప్పుడుచేయక మరొకప్పుడు చేయవచ్చునని వాయిదావేసి నిలిపియుంచుటవల్ల బహుభాషా ప్రయుక్తములైన ప్రస్తుత రాష్ట్రములందున్న భిన్న భాషల ప్రజలలో పరస్పర స్పర్థలు యెక్కువ కాగలవు.

ఇందువల్ల అభివృద్ధి నిరోధ మేర్పడును. ఆయా రాష్ట్రములలో పాఠశాలలందు రాష్ట్రీయభాషలయందే విద్య నేర్పవలెనను సిద్ధాంతము ననుసరించుచున్న యీ సమయములో భాషారాష్ట్రముల నిర్ణయం త్వరగా జరుగుట మంచిది. పరిహద్దులనిర్ణయమున్నూ ఆర్థికముగా ఆయా రాష్ట్రముల స్వయం నిర్వహణావకాశముల గూర్చియు నిదానంగా ఆలోచించుకోవచ్చును.

బ్రిటిషురాజు యెడల భక్తికలిగి భారతదేశము బ్రిటిషురాజును శిరసావహించునా లేక కామనువెల్తులో మాత్రమే భారతదేశము చేరియుండునా అనే విషయము ఇటీవలల లండనులోజరిగిన కామనువెల్తురాజ్యాల పార్లమెంటు అధ్యక్షుల సభయందు చర్చింపబడెను. బ్రిటనుతో సమాన ప్రతిపత్తి గల స్వతంత్ర రాజ్యంగానే భారతదేశంకూడా ఉండి కామనువెల్తు రాజ్యాలతో సహకరింపగోరుచున్నదనే అభిప్రాయమును భారతప్రభుత్వ ప్రతినిధివర్గము ఆసభలో వెల్లడించెను.

# రాష్ట్రాభిమానం

## లియాకతాలీ ఉపన్యాసం

ఢక్కా, నవంబరు 27 : పాకిస్తాను ప్రధాన మంత్రి లియాకతాలీ ఖాను గారు తూర్పు బెంగాలు జిల్లాల యందు 7 దినములు పర్యటనముచేసి నేడు ఢక్కాకు తిరిగివచ్చిరి. ఇచట నేటి సాయంకాలము విద్యార్థుల సభలో ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి.

విద్యార్థులు నాకు సమర్పించిన సన్మానపత్రములో కేంద్ర ప్రభుత్వోద్యోగములందు జనసంఖ్యా ప్రమాణమును బట్టి ప్రాతినిధ్యము ఉండవలెనని కోరిరి. ఇదంతా రాష్ట్రాభిమానము తప్ప మరేమియూ కాదు. తూర్పు పాకిస్తానులో సంకుచిత రాష్ట్రాభిమానం లేదని అంటారు. కాని మీరు సమర్పించిన సన్మానపత్రములో రాష్ట్రాభిమానంతప్ప మరేమీ లేదు. పాకిస్తాను లభించకపూర్వము ప్రజాసంఖ్యా ప్రమాణము ననుసరించి ప్రాతినిధ్యముండరాదని వాదించితిమి. కాని, పాకిస్తాను వచ్చినతర్వాత రాష్ట్రాభిమానంతో ప్రజాసంఖ్యా ప్రమాణము ననుసరించి ప్రాతినిధ్యం కావలెనని కోరుచున్నాము. ప్రత్యేక రాష్ట్రాభిమానములతో మనము ప్రవర్తించినయెడల యీ ప్రాంతీయాభిమానములతో పాకిస్తాను భగ్నమగును.

పాకిస్తానులో ఉర్దూతోబాటు బెంగాలి భాషనుకూడా ప్రభుత్వ వ్యవహార భాషగ ఆమోదింపవలెనని మీరు కోరిరి. పాకిస్తాను ప్రభుత్వముయొక్క వ్యవహార భాషనుగూర్చి మీకు అనవసరముగా పెద్ద వాదిరిక్కములకు దిగుచున్నారు. వ్యవహారభాష ఇదివరకే నిర్ణయింపబడినది.

అనేక విద్యాశాలలందు సమగ్రమైన విద్యాబోధనలుగా నాంచేసేటటువంటి మహమ్మదీయేతర విద్యాంసులు ఇచటినుండి కొందరీమధ్యనే వెడలిపోవుటవల్ల ఇచటి విద్యాశాలలందు సమగ్రమైన ఉపాధ్యాయుల కొరత యేర్పడినది. తూర్పు బెంగాలులోని కాలేజీలయందు సైనికశిక్షణ యివ్వవలెనను విషయమై పాకిస్తాను గవర్నమెంటు ఆలోచించుచున్నది. కాని యిక్కడ ఒక సైనికశిక్షణ కళాశాలను వెంటనే నెలకొల్పజాలము.

పాకిస్తానులో జమీందారీలకు నష్ట పరిహారము ఇవ్వకుండా వెంటనే వాటిని రద్దు చేయవలెనని మీ అభిప్రాయము సూచించిరి. కాని, మనము అనీతిగాచేసినట్లయితే పాకిస్తాను ప్రజలయెడల లోకానికి నమ్మకము పోగలదు.

# భారత దేశంలో పరదేశ యాత్రికుల సౌకర్యావకాశములు

## ఇండియా ప్రభుత్వం సంకల్పించిన వ్యాపారసంస్థ

ఢిల్లీ, నవంబరు 27 : వివిధ దేశాలనుంచి భారతదేశము సందర్శించుటకై విజ్ఞానార్థము వినోదార్థము యాత్రికులు విరివిగా వచ్చునట్లు ఆకర్షించుటకై వివిధమైన సౌకర్యసదుపాయములను వ్యాపారసరళిగా చేయవలెనో నిర్ణయించుటకై ఒక ఉపసంఘము ఇండియా ప్రభుత్వపు రైల్వేశాఖా మంత్రిచే నియమింపబడెను. ఈ కమిటీ ప్రథమసమావేశము నేడు ఢిల్లీలో జరిగెను. ఈ కమిటీ సమావేశమును ఉపక్రమించుచు రైల్వేల శాఖామంత్రి కే. సంతానంగారు ఇట్లు చెప్పిరి.

విదేశయాత్రికులను యీ దేశములో పర్యటనం చేసి యీ దేశములోని అనేక చరిత్ర ప్రసిద్ధములైన మనోహరములైన ప్రదేశములను చూచుటకై ఆకర్షించవలెను. అట్టి దేశ సందర్శనా దక్షులైన యాత్రికులకు కావలసిన సౌకర్యములను, హోటళ్లను, రస్తాలు వగైరా సౌకర్యములను వారివెంట తిరిగెడి మార్గదర్శకులను ఏర్పాటుచేయవలెను. ఇదంతయును కొన్ని కోట్లధనము వెచ్చించి ఒక వ్యాపారసరళి సంస్థగా నిర్వహించి దేశమంతటను శాఖా కార్యాలయములను ఏర్పాటుచేయవలెను. ఈ వ్యాపారసంస్థకు కేంద్ర ప్రభుత్వము రాష్ట్రీయప్రభుత్వములు పెట్టుబడి పెట్టవలెను. ప్రయివేటు హోటళ్ళ మేనేజర్లు ప్రజలుకూడా యీ సంస్థలో షేర్లు కొనుక్కొనవచ్చును.

విదేశాలలో యిట్టి యాత్రిక సౌకర్య సంస్థలు ఏరీతిగా పని చేయుచున్నవో పరిశీలింపవలెను. అటువంటి స్థిరమైన యాత్రిక మార్గదర్శక సంఘము ఏర్పడేవరకు తాత్కాలికముగా ఎట్టిఏర్పాట్లు చేయవలెను ప్రస్తుతము దేశంలో ఎంతవరకు ఇటువంటి సౌకర్యములు కలవు అను విషయములను గూర్చి యీ కమిటీ పరిశీలించి సలహాలను యివ్వవలెను.

ఈ సమావేశమునకు అనేక రాష్ట్ర ప్రభుత్వముల ప్రతినిధులు విమాన రహదారి కంపెనీల ప్రతినిధులు హోటలు వ్యాపార సంస్థల ప్రతినిధులు విచ్చేసిరి.

# రాజుగారమ్మని లారీ డ్రైవరుకు ఆహ్వానం

వయస్ బేడన్, నవంబరు 27 : ప్రెంచి పశ్చిమ ఆఫ్రికాలోని, టోగలండ్ ప్రాంతములోని ఒక ఆఫ్రికా జాతికి రాణియైన ఒక వృద్ధ స్త్రీ జర్మనీలో లారీ డ్రైవరుగా పనిచేయుచున్న తనమనుమనికి ఒక వర్తమాన మంపినది. తాను వృద్ధురాలినైనాననీ ఇక ఈ రాచరికము నిర్వహింప జాలననీ, వచ్చి అభిషిక్తుడవు కమ్మనీ ఆవార్తలో నున్నది. ఈ యువకుడు 28 సంవత్సరముల వయస్సుగల ఆగర్ సెమనూ అనువాడు.

పూర్వము ఇతని తండ్రిని తాతగారు విద్యాభ్యాసమునకై జర్మనీకి పంపిరి. అతడు ఒక జర్మన్ స్త్రీని వివాహమాడి జర్మనీలోనే ఉండిపోయినాడు. సెమనూ వారి సంతానము.

# ఉద్యోగ పరీక్షలకు వయసు మీరినవారికి సౌలభ్యం

ఢిల్లీ, నవంబరు 27 : జాతియోద్యమము వంటి పొగ్గాని, ఆకారణముగా, కేంద్ర ప్రభుత్వముచే నిర్వహింపబడుచున్న ఫెడరల్ పబ్లిక్ సర్వీసెస్ కమిషన్ వగైరా పరీక్షలకు కూర్చుండుటకు వయసుమీరిన వారికి సావకాశముగా వయోనిర్ణయ నిబంధనలు కొంత సడలింపబడినవి.

జాతీయోద్యమములో పాల్గొనుటవల్ల, శిక్షింపబడిగాని, నిర్బంధములో నుంచబడిగాని, డిబారుచేయబడిగాని పరీక్షకు కూర్చుండుటకువలనను వయస్సు ప్రమాణము మీరిపోయినవారు అట్టిపరీక్షకు, ఒకవర్యాయము మాత్రము కూర్చుండుటకు అవకాశ మొసంగబడుచున్నది. పరీక్ష తేదీకి 35 సంవత్సరముల ప్రాయము మించనివారికి మాత్రమే యీ అవకాశ మొసంగబడును.

1950 సంవత్సరం, డిశంబర్ 31 వ తేదీతో ఈ అవకాశము రద్దుచేయబడును.

తాడేపల్లిగూడెంలో నవంబరు 16-న హిందూసమాజం స్థాపింపబడెను. వి. నారాయణమూర్తిగారు అధ్యక్షుడుగ, డి. సత్యనారాయణగారు కార్యదర్శిగ ఎన్నుకోబడిరి.

# జయపూర్ కాంగ్రెస్ కార్యక్రమం

## గాంధిజీ చిత్రప్రదర్శన ఏర్పాటు

జయపూర్, నవంబరు 27 : జయపూర్ వద్ద జరుగనున్న అఖిలభారత జాతీయ కాంగ్రెస్ సంఘ మహాసభకు కార్యక్రమం ఒకటి తయారు చేయబడెను. దీనిప్రకారం బహిరంగసభ డిసెంబరు 18, 19 తేదీలలో మధ్యాహ్నం 3 గంటలనుండి రాత్రి 9 గంటలవరకు జరుపుటకు నిర్ణయించబడెను. జాతీయకాంగ్రెస్ నూతనాధ్యక్షుడు జయపూర్ నకు డిసంబరు 15 మధ్యాహ్నం వచ్చును. ఆరోజునే అధ్యక్షుని ఊరేగింపు జరుగును. డిసెంబరు 16 వ తేదీ ఉదయం పతాకోత్సవం జరుగును. ఆ మధ్యాహ్నమే ఎ. ఐ. సి. సి. సమావేశం, విషయనిర్ణయ సభకూడ జరుగును. అవసరమైనచో విషయనిర్ణయసభ 17 వ తేదీనకూడ జరుగును. డిసెంబరు 16 వ తేదీ ఉదయం కాంగ్రెసు కార్యవర్గ సమావేశం జరుగవచ్చును. సర్వోదయ వస్తుప్రదర్శన ప్రారంభోత్సవము డిసెంబరు 14 వ తేదీ ఉదయం జరుగును. వస్తుప్రదర్శనసంఘ కార్యదర్శి యీక్రింది ప్రకటన చేసెను :

"గాంధిమహాత్ముని ఛాయా చిత్రములతోకూడిన ఒక చిత్రకళా ప్రదర్శనశాలను గాంధీజీ మండపములో ఏర్పాటు చేయవలచినాము. సర్వోదయ వస్తుప్రదర్శనలో బాజాజీమండపం ప్రముఖస్థానము నలంకరించగలదు. గాంధీజీ జీవితమునందలి వివిధఘట్టములలో తీయబడిన ఆయన ఛాయా చిత్రములను ప్రదర్శించవలెననియే యీచిత్రకళా ప్రదర్శనాలను ఏర్పాటుచేయుటలో గల ఉద్దేశ్యం కాబట్టి యీవిన్నమైన గాంధీజీ చిత్రములున్నవారు వాటిని సర్వోదయ వస్తుప్రదర్శనకు పంపించవలసిందిగా కోరుచున్నాను. ఈ చిత్రములు తిరిగి వాటి యజమానులు కావలెనని కోరినచో ప్రతి తీసుకొని పంపబడును. గాంధీజీని గురించి అనేక భాషలలో అనేక గ్రంథములు వ్రాయబడినవన్న విషయం అందరకు తెలిసినదే. సాధ్యమైనంతవరకు యీపుస్తకములన్నిటినీ సేకరించి ప్రదర్శింపవలెనని మా ఉద్దేశ్యం. ఈ పుస్తకములను ప్రచురించిన ప్రచురణకర్తలుగాని గ్రంథకర్తలుగాని ఒక్కొక్క పుస్తకమును, దానిపేరును హిందీలోగాని, ఇంగ్లీషులోగాని ఒక కాగితంమీద వ్రాసి దానిని పుస్తకమునకు అంటించి పంపవలసిందని కోరుచున్నాను.

సర్వోదయ వస్తుప్రదర్శనలో ప్రదర్శింపబడిన యీచిత్రములు, పుస్తకములు, గాంధీస్మారకనిధి సంఘంవారు ఏర్పాటు చేయవలెనని తలంచుచున్న గాంధీస్మారక వస్తుప్రదర్శనశాలకు బహూకరించబడును. పుస్తకములను, చిత్రములను రిజిస్టరు పోస్టుద్వారా కార్యదర్శి, సర్వోదయ వస్తుప్రదర్శన సంఘం, గాంధీనగర్, జయపూర్ చిరునామాకు పంపవలసిందని కోరుచున్నాను.

# కాంగ్రెస్ సేవాదళ రజితోత్సవములు

ఢిల్లీ, నవంబరు 25 : 25 సంవత్సరముల నాడు కాకినాడ కాంగ్రెస్లో ప్రారంభింపబడిన 'కాంగ్రెస్ సేవాదళముయొక్క రజితోత్సవము ఈ డిశంబరు 28 వ తేదీన దేశమందంతటను జరపవలయునని ఆదేశించుచూ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శంకర్ రావుగారు నేడొక ప్రకటన చేసిరి.

# నెహ్రూ రత్నోత్సవ సంచిక

## సంపాదకవర్గ సమావేశం

న్యూఢిల్లీ, నవంబరు 27 : నెహ్రూ రత్నోత్సవ సంచికను వెలువరించుటకు నియమింపబడిన సంపాదకవర్గపు సభ్యులు నేడిచ్చట సమావేశమైరి. ఈ సమావేశమునకు బాబూ పురుషోత్తమదాస్ టాండన్, కె. యం. మున్షీ, సేట్ గోవిందదాస్, విశ్వనాథామోర్తి, డాక్టర్ లంకసుందరంగార్లు హాజరైరి. డాక్టర్ యస్. రాధాకృష్ణన్, నందలాల్ బోస్ గారలు కూడ ఈ సంపాదకవర్గమునందున్నారు. కాని వారీ సమావేశమునకు హాజరుకాలేదు. ఈ సంపాదక వర్గమునందు చేరవలసినదిగా బాబూ రాజేంద్రప్రసాద్ గారికి కూడ ఆహ్వానమంపబడినది.

1949 సంవత్సరం నవంబర్ 14 వ తేదీన, అనగా ఆయన 60 వ జన్మదినోత్సవ సందర్భమున ప్రధాని రత్నోత్సవ సంచికను వెలువరించి, ఆయనకు సమర్పించుట ఈ సమావేశముయొక్క లక్ష్యము. హిందీ, ఇంగ్లీషు భాషలు రెంటిలోనూ ఈ సంచిక వెలువడును.

నెహ్రూ ప్రధానిని అభ్యాసించుచు, జాతీయ, అంతర్జాతీయ నాయకులు చేసిన శంసనలన్నీ యీ సంచికయందు సంపుటీకరింపబడగలవు.

# సమితి సభ్యత్వానికి 12 రాజ్యాల దరఖాస్తులు

## రాజకీయసంఘ సిఫార్సులు

పారిస్, నవంబరు 27 : ఐక్యరాజ్య సమితికి చెందిన రాజకీయసంఘము సమితి సభ్యత్వమును అర్థించిన 12 రాజ్యములలో ఆరు రాజ్యముల దరఖాస్తులనుపునః పరిశీలన చేయవలసినదని భద్రతాసంఘమును కోరినది. ఈ ఆరురాజ్యములు ఇటలీ, ఫిన్లాండు, పోర్చుగల్, ట్రాన్స్జోర్డాన్, ఐర్, ఆస్ట్రియా, వీటి దరఖాస్తులపై అనుకూలమైన సిఫార్సులే చేయబడినవి.

సింహళద్వీప దరఖాస్తు వచ్చే బుధవారమునాటికి వాయిదాపడినది. సింహళ ప్రతినిధి గుణతిలక్గారు తూర్పుయూరప్ రాజ్యప్రతినిధులతో సింహళద్వీప స్వాతంత్ర ప్రతిపత్తి విషయమై వచ్చిన భేదాభిప్రాయములను చర్చించుచున్నారు.

# సి. పి. లో స్త్రీ పోలీసుదళం

నాగపూర్, నవంబరు 27 : సాధారణ చాకులుగానూ, మద్యపాన నిషేధానకరా లకున్నూ పనిచేయడానికై ఒక స్త్రీ పోలీసు సూపరింటెండెంటు అధికారం క్రింద రెండువందలమంది పోలీసులు కలిగిన ఒక స్త్రీ పోలీసుదళాన్ని నిర్మాణం చేసేవిషయాన్ని సి. పి. ప్రభుత్వం పరిశీలిస్తున్నదని తెలుస్తున్నది.

ఈదళం సంతృప్తికరంగా పనిచేసినట్లయితే, దీనిని అభివృద్ధిచేసి, ఇతర పోలీసుకార్యాలయకూడా వీరికి అప్పగించబడలాయి. గ్లోబ్.

# భారత సేనలకు లక్షన్నర సిగరెట్ల బహూకరణ

న్యూఢిల్లీ, నవంబరు 25 : భారత సేనల వినియోగార్థము నేషనల్ టొబాకో కంపెనీవారు లక్షన్నర సిగరెట్లను నేడు బహూకరించిరి. రాజ్యాంగపరిషత్తు భవనములోని కార్యాలయము వద్ద నేడు ప్రధానికి ఇవి అందజేయబడెను.

# నీగ్రోల వోటింగుహక్కు అపహరణ

## అమెరికాసెనెటుకువిన్నపం

వాషింగ్టన్, నవంబరు 27 : మొన్నటి అమెరికా అధ్యక్షఎన్నికలలో ఐదు దక్షిణ రాష్ట్రములకు చెందిన 20 లక్షల మంది నీగ్రోలకు వోటు చేయుట కధికారము లేక పోయినదనీ ఈ విషయమై సెనేటు విచారణ జరుపవలెనని నీగ్రో జాతీయ మండలి వారు విన్నపము పంపిరి.

# మహా బౌద్ధుల అస్థి నిక్షేపములకు ప్రధాని నెహ్రూ ఆహ్వానం

న్యూఢిల్లీ, నవంబరు 27 : బుద్ధదేవుని ప్రధాన శిష్యులైనవూ, సుప్రసిద్ధ బౌద్ధభిక్షువులునూ ఐన, శ్రీ మొగ్గలానప, సరీపుత్రుల అస్థినిక్షేపములు సింహళమునుండి భారత దేశమునకు తేబడుచున్నవి. జనవరి 14 వ తేదీన ప్రధాని నెహ్రూ ఈ పవిత్ర నిక్షేపములకు ఆహ్వాన మొసంగి స్వీకరింపనున్నాడు. తరువాత ఈ నిక్షేపములను మహోత్సవము చేయుచూ తీసుకొనిపోయి మహాబోధి సంఘము వారికి అందజేయబడును. ఆ సంఘమునకు శ్రీ శ్యామప్రసాద ముఖర్జీ గారు అధ్యక్షులు.

అస్థి నిక్షేపముల ఆహ్వాన సంఘము తరఫున, పశ్చిమ బెంగాలు ప్రభుత్వముచే పంపబడిన ప్రతినిధులు, పవిత్రపాణులు నెలూలి జినరత్న భిక్షువు, జోతిశ్చంద్ర ఘోషగారలు నేడు ప్రధానిని కలుసుకొని ఈ సందర్భమున జరపవలసిన యేర్పాట్లను గురించి చర్చించిరి: ఈ స్వాగతోత్సవమునందు పాల్గొనుటకు, చైనా, బర్మా, సింహళము, సయాం, కాంబోడియా, సిక్కిం, భూటాన్ ప్రభుత్వముల ప్రతినిధులు ఆహ్వానింప బడుదురు.

# కొత్తరకం బస్సు

లివర్పూల్, నవంబరు 27 : 56 మంది ప్రయాణీకులు కూర్చుండుటకు వీలుగా రెండంతస్తులలో నిర్మించిన ఒక బ్రిటిషు బస్సు ఈ వారాంతమున నౌకలో కలకత్తాకు పంపబడుచున్నది. దీని బరువు 8945 టన్నులు. పశ్చిమ బెంగాలు ప్రభుత్వము ప్రత్యేకముగ కోరినందున దీని నిర్మాణము జరిగినది. దీన్ని కలకత్తాలో ఉపయోగించెదరు. ఇటువంటి బస్సులే పాకిస్తానుకు, సింహళమునకుకూడ పంపబడినవి ఇది కలకత్తాకు డిసెంబరు 22 న చేరును.

# అమెరికాకు సయాం విజ్ఞప్తి

వాషింగ్టన్, నవంబరు 27 : ఐదు దళములకు సరిపోవు ఆయుధసామగ్రిని సరఫరా చేయవలసినదని సయాం ప్రభుత్వము అమెరికాను కోరినట్లు అధికారవర్గముల ద్వారా తెలియుచున్నది. సయాం-మలయా సరిహద్దులో కమ్యూనిస్టులను అణచివేయుటకు ఈ సామగ్రిని ఉపయోగిస్తారట. అమెరికా విదేశశాఖ ఈ విన్నపమును ఆలోచించుచున్నదట.

# మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 29 :

వేరుసెనగ : (5 1/2 సా 1-కి ఎరుపు కోస్తాగిడ్డంగులు) మెషీన్ (సెల్సుటాక్సుతో సహా) బజారు(పాతది) రు. 151-0-0

ఆఫరువద్ద రు.

వేరుసెనగనూనె: ఎక్స్పెల్లర్ (టాల్ కోల్)

(సేల్సుటాక్సుతోసహా) రు. 316-0-0

(గ్యారంటీ)

అమూదం బజారుజెలివరీ ఎక్స్పెల్లర్ పర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గంది మొదటిరకం రు. 550-0-0

మెంతులు (84 పౌను గల బస్తా) రు. 35-0-0, 35-8-0

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎస్వారు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు 75-10 0 పెట్టా బంగారు తులం 113 8 0 నూసబంగారు 111-12 0. నసువెండి తులం 100-8 (రెడీ) 178-0-0 వెండి తులం 1 13-0

పంచదార

| | |
|---|---|
| "కాన్పూరు" (2 అందరు) | రు. 105-8-0 107-0-0 |
| బూరా (25 పౌన్లు) | రు. 11-4-0 |
| కలకండ (25 పౌన్లు) | రు. 15-4-0 |


# బొంబే మ్యూచుయల్ లైఫ్ అస్యూరెన్సు సొసైటీ లి॥

(స్థాపితము 1871)

హెడ్డాఫీసు : బొంబాయి.

* ఇండియాలో పురాతనమైన బీమాసంస్థ.
* ఇండియాలో గొప్ప మ్యూచుయల్ లైఫ్ ఆఫీసు.
* పాలిసీహోల్డర్లకు చెంది వారిచే కంట్రోలు చేయబడుచున్నది.
* గారంటీ మైన పాలిసీ షరతులు.

సరళమైన కమీషను మీద ఏజంట్లు కావలెను.

వివరములకు :

ఎస్. ఎ. రామస్వామి & బ్రదర్సు, మద్రాసు రాష్ట్రము, తిరువాన్కూర్, కొచ్చిన్ సంస్థానములకు చీఫ్ ఏజంట్లు. "బొంబే మ్యూచువల్ బిల్డింగ్", 378, చైనా బజారు రోడ్డు, మద్రాసు.


కావలెను

ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు

వాల్తేరులోని ఆంధ్ర యూనివర్సిటీకి రు 150-10/2-200 గ్రేడు మీద తెలుగులో ఒక లెక్చరరు ఉద్యోగమునకు దరఖాస్తులు కోరబడుచున్నవి. కావలసిన కనీస యోగ్యతలు : భాషాశాస్త్రము వ్యుత్పత్తి శాస్త్రములలో ముఖ్యముగా [illegible] ఫైలాలజీలో స్పెషల్ జ్ఞానముతో తెలుగులో బి. ఏ. (ఆనర్సు) గాని ఎం. ఏ. గాని ఒకటవ తరగతిలో రెండవ తరగతి పొంది యుండవలెను. పరిశోధన నాభవము బోధనానుభవము గల అభ్యర్థికి ప్రాముఖ్య మొసంగబడును.

ఇంటర్వ్యూకు కోరబడిన అభ్యర్థులు నిర్ణయించిన తేదీకి, వేళకు వారి స్వంత ఖర్చుల మీద వాల్తేరుకు రావలసియుండును.

ఏ రూపములో కాన్వాసింగు చేసిన యెడల వారు అనర్హులుగా చేయబడుదురు.

దరఖాస్తుఫారములు, సర్వీసు నిబంధనలు ఇతర వివరములకు వాల్తేరు, ఆంధ్ర యూనివర్సిటీ రిజిస్ట్రారుగారికి వ్రాసికొనవలెను. నిర్ణీతఫారములో దరఖాస్తులు 15-12-48 తేదీలోగా రిజిస్ట్రారుకు చేరవలెను.


# మదనకామేశ్వర లేహ్యం

ఇది మేహములు, నీరసము, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము, మొదలగువాటిని కరిడించి, మంచి బలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమైనది 2 డబ్బీల ధలుదు. 20 తులముల డబ్బి రు 2/- పోస్టేజి ప్రత్యేకము.

పి. సి. ఏ. అండ్ కంపెనీ.

ఆయుర్వేదసమాజం, పెరిదేపి. (నెల్లూరుజిల్లా) బ్రాంచి : 7. పీను మొదలివీధి, మద్రాసు.

# 501 సబ్బుతో ఉతుకబడినది.

ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ, లిమిటెడ్

69/249

## పంటల పంచాంగం

సర్వధారి నం॥ కార్తీక బ॥ అమా॥ 1948సం॥ నవంబరు30 మంగళవారం ప॥అమా॥రా 12 14 అనూ రా 2.31వర్జ్యం ఉ 7.4 ల 8.28 వు.

మార్గశీర్షమాసము

శు॥ ప్రథమ డిసెంబరు 1 బుధవారం శు॥ ప్రథమ రా11 20 క్యేష్ఠ రా2.18వర్జ్యం ప 8.5 లు 9.40 వు.

ఆంధ్రపత్రిక

సర్వధారి నం॥ కార్తీక బ॥ అమా॥

మంగళవారం

## చైనా అంతర్యుద్ధం: అమెరికా వైఖరి

కుమింటాంగ్ చైనా రాజధాని నాన్కింగ్‌కు 35 మైళ్లలో కమ్యూనిస్టుసేనలు ప్రచండ యుద్ధము చేయుచున్నట్లును, సాంగై పరిస్థితులు ప్రమాదకరముగు చున్నట్లును చాంగ్‌కై షేక్ ప్రభుత్వవర్గములే అంగీకరించుటవలన దాదాపు పది సంవత్సరములుగ జరుగుచున్న అంతర్యుద్ధము ముగింపుదశకు వచ్చినట్లు స్పష్టమగుచున్నది. అమెరికా వెంటనే జోక్యము కల్గించుకొని చైనాలో రష్యాను ప్రతిఘటించి, జయింపకున్న దూరప్రాచ్యమంతయు కమ్యూనిస్టువశము కాగలదని, "జాతీయ చైనా" అంతరించి పోగలదని చాంగ్‌కై షేక్ అమెరికా అధ్యక్షునకు, చైనా శాసనసభ అమెరికా కాంగ్రెసుకు చేసిన విజ్ఞప్తులు సూచించుచున్నవి. కమ్యూనిస్టు ఉధృతమును అరికట్టగల శక్తి తమకు ఇక లేదని చాంగ్‌కై షేక్ ప్రభుత్వము గ్రహించినది. కనుకనే అమెరికా స్వీయ క్షేమమును గుర్తించి అయినను చైనాలో వెంటనే జోక్యము కల్గించుకొనవలసియున్నదని చాంగ్‌కై షేక్ ప్రభృతులు అమెరికా రాజ్యాంగ తంత్రజ్ఞులకు విజ్ఞప్తులపై విజ్ఞప్తులు చేయుచుండిరి. ప్రకటితమైన అమెరికా అధికారవర్గముల వైఖరిని బట్టి రష్యాతో ప్రత్యక్షముగ యుద్ధమునకు దిగుటకు అమెరికా సిద్ధముగ లేదని భావింపవలసియుండును. ఇంతవరకు అమెరికా తన సైనికదళములను ప్రయోగింపలేదన్న మాటేగాని, చాంగ్‌కై షేక్ ప్రభుత్వమునకు ఇతోధికముగ సంపూర్ణసహాయమును చేయుచునేయున్నది. కాని అందువలన ఎట్టి ప్రయోజనము లేకుండెను.

కనుకనే ఇప్పటికంటె హెచ్చు సహాయము చేయుటను గురించి అమెరికా అధికారులు ఇంతవరకు ఒక నిర్ణయమునకు రాలేకపోయిరి. అధిక సహాయమన్న ప్రత్యక్ష పోరాటమే. అది రష్యా అమెరికా సంఘర్షణగ పరిణమింపకతప్పదు. 1945 చైనా-రష్యా స్నేహ ఒడంబడికకు విరుద్ధముగ సోవియట్ ప్రభుత్వము కమ్యూనిస్టులకు సహాయము చేయుచున్నట్లు చాంగ్‌కై షేక్ ప్రభుత్వము ఆరోపించియుండెను. రష్యాపై భద్రతాసమితికి ఫిర్యాదుచేయదలచినట్లు కూడ ప్రకటించెను. కాని ఇంతవరకు ఫిర్యాదుచేసియుండలేదు. అట్టి ఫిర్యాదువలన ప్రయోజనము శూన్యమని గ్రహించి యుండవచ్చును. గ్రీస్ వ్యవహారములు దీనికి భవిష్యత్పరిణామమును సూచించియుండవచ్చును. ఏమైనను నేడు చాంగ్‌కై షేక్ ప్రభుత్వము అత్యంత ప్రమాదస్థితియందున్నదని, అమెరికా సహాయము కూడ ఆ ప్రమాదమును నివారింపజాలదని గత వారమురోజులయుద్ధగతి స్పష్టము చేయుచున్నది. మదాం చాంగ్‌కై షేక్ వాషింగ్టన్ యాత్రవలన పరిస్థితులు కుమింటాంగ్‌కు అనుకూలముగ మారగలవను నమ్మకము కూడ కన్పించుటలేదు.

పరిస్థితు లింతగ విషమించినప్పటికిని చాంగ్‌కై షేక్ ప్రభుత్వ వైఖరిలో ఎట్టి మార్పు వచ్చియుండలేదు. అమెరికా అంత సుముఖముగ లేకపోవుటకు కూడ ఇదే కారణమని ఇటీవల జార్జి మార్షల్ ప్రకటన వెల్లడించుచున్నది. అవసానకాలమున ఏమి చేసినను ప్రయోజనము ఉండదని, అందువలన అమెరికాకు కలుగు లాభములు కూడ గణింపతగ్గవి కావని ట్రూమన్ ప్రభృతుల అభిప్రాయమై యుండవచ్చును. కాని "కమ్యూనిజమును అమెరికాలోనే గాక, ప్రపంచములో ఏ ప్రాంతమునందైనను ప్రతిఘటించుటకు దీక్షబూనిన అమెరికా అధ్యక్షుడు చైనా విషయములో ఇట్టివైఖరిని అవలంబించుటకు వేరుకారణములు ఉండవలెను. చైనా చెయి జారిపోయినదని భావించి ఆసియాలో ఇతర ప్రాంతములందు కమ్యూనిస్టు వ్యతిరేకశక్తుల సంఘటితపరచుటలో తన యావచ్ఛక్తిని వినియోగించుటకు అమెరికా అధ్యక్షుడు నిశ్చయించుకొని యుండవచ్చును. లేక ఆస్ట్రేలియా ప్రధాని చెప్పి వివరించినట్లు ఆసియా దూరప్రాచ్య ఆర్థికపరిస్థితులు అధ్వాన్నముగనుండి, వాటిని వృద్ధిచేయజాలక, అందువల్ల సర్వదు అసంతృప్తిని సైనికబల ప్రయోగమువలన అణచివేయుట అసాధ్యమని గ్రహించి యారపులోనే కమ్యూనిస్టు వ్యతిరేకవర్గమును తయారు చేయుట లాభకరమని ట్రూమన్ అభిప్రాయ పడియుండవచ్చును. ఈ పరిస్థితులలో ఆసియా, దూరప్రాచ్యదేశములు, అమెరికాపై ఆశలు పెట్టుకొనుట నిష్ప్రయోజనము.

చైనా కమ్యూనిస్టు రాజ్యమగుటతో ఆసియా, దూరప్రాచ్యదేశములు క్రొత్తసమస్యలను ఎదుర్కొనవలసియుండును. రష్యా తన "సామ్రాజ్య విస్తరణ" కార్యక్రమమును తీవ్రతరము చేయవచ్చును. ఇతర దేశములందలి కమ్యూనిస్టు పక్షములు ప్రత్యక్ష పోరాటమునకు ఉపక్రమింపవచ్చును. ఈపరిణామము తృతీయ సంగ్రామమునకే దారితీయగలదు. అమెరికా ఈ విషయమును గుర్తింపకపోవుట శోచనీయము.

## బ్రిటిష్ లేబర్‌పార్టీ ఎన్నిక సంరంభం

లండన్, నవంబర్ 28: రాబోవు ఎన్నికలను దృష్టియందుంచుకొని బ్రిటిషులేబర్ పార్టీ తన బలములను పటిష్ఠపరచుకొనుటకు ప్రయత్నించుచున్నది.

ఇటీవల ఎడ్మన్టన్ పార్లమెంటరీ ఉప ఎన్నికలో లేబర్ ప్రతినిధికి విజయము లభించుట కృతార్థతకుదృష్టాంతమైనది. 1945 లో ఈ స్థానమున 19000 వోట్లు మెజారిటీ వచ్చినవి. మొన్న నూ 4000 మాత్రమే వచ్చినవి. ప్రభుత్వ స్వీకారమునకు ముందు లేబరుపార్టీ పలుకుబడి పెంపొందించుటకు తీవ్రమైన ప్రయత్నములు సాగుచున్నవి. విదేశీ వాణిజ్య వర్గములలో సమాచారము ఏర్పాటుచేయుటయు, ఇంటింటికి పోయి పార్టీ అభ్యర్థులను బలపరచుటకు ఏర్పాట్లు జరుగుచున్నవి.

## వరిపంట అధికం చేయడానికి కృషి

### ప్రపంచ సంఘస్థాపన

ఆహారవ్యవసాయికసమితి నిర్ణయం

వాషింగ్టన్, నవంబరు 27: గోధుమల ఉత్పత్తి అభివృద్ధి సందర్భమున ఆయా దేశముల అభివృద్ధి పథకములను సమన్వయపరచుటకు ఒక సంఘమును ఏర్పరిచినట్లే, బియ్యము లోటువలన ఏర్పడిన ప్రమాదపరిస్థితిని ఎదుర్కొనుటకు, ఒక సంఘమును ఏర్పరచుటకు ప్రపంచ ఆహార వ్యవసాయిక సంఘము తలపెట్టినది.

ప్రపంచములో బియ్యమును వినియోగించువారి సంఖ్య ప్రతి సం॥ము 10 మిలియనుల చొప్పున పెరుగుచున్నదనీ, అందువల్ల మునుపటికంటె 13 లక్షల టన్నుల బియ్యము అదనముగా కావలసి యున్నదని అంచనా వేయుచున్నారు. బియ్యము ప్రధాన ఆహారధాన్యముగా వినియోగించుచున్న దేశములందు ప్రస్తుతము అక్కడి జనులకు లభించునది, యుద్ధమునకుపూర్వము లభించుదానికన్న తక్కువగా యున్నది. అందువల్ల, వినియోగదారులకు ప్రస్తుతముకన్న సంతృప్తికరముగా సరకు లభింపజేయుట యుద్ధమునకు పూర్వముకన్న కూడ ఎక్కువ లభించునట్లు చూచుట, అను రెండు విషయములను దృష్టియందుంచుకొని ఉత్పత్తిని అధికముచేయుట ప్రథమకర్తవ్యముగ ఉండవలెనని భావించుచున్నారు. ఈ సందర్భమున పెరిగే జనసంఖ్యను కూడ గమనించవలెనని కూడ సూచింపబడినది. దానిని సాధించుటకు అనేకపనులను చేయవలసి యున్నది. వ్యవసాయ పరిశోధనను ఇంకను ఇనుమడింపచేయుట, ఇప్పటికన్న ఎక్కువ ఉపయోగకరమైన సాగుపద్ధతులను అవలంబించ వలసినదని వ్యవసాయదారులను ప్రోత్సహించి, అలావారు అవలంబించుటకు తగిన ఆర్థిక ప్రయోజనమును కనపరచుట, గ్రామప్రాంతముల అభివృద్ధికి ఉపకరించు ఇతర సదుపాయములను చేయుట, మొదలైనవి చేయవలసియున్నవి. బియ్యము అవసరము ఎక్కువలవుచుండగా, అమెరికా పథకములు చూచినవారి ఉత్పత్తిఎక్కువ రెండు తగ్గునట్లు కనపడుచున్నది. కొన్ని దక్షిణఆసియా దేశములుకూడ వారి బియ్యము ఉత్పత్తిని అధికముచేయు పథకములను దీక్షతో అమలు జరుపుటలేదు. ఈ స్థితి కొంత భయమునకు కారణమగుచున్నది. అయితే, ఈ పరిస్థితిని అధిగమింపవచ్చునని ప్రవీణులు అభిప్రాయపడుచున్నారు. బియ్యము ఉత్పత్తి చేయుదేశము లన్నియూ తమ ఉత్పత్తిని గురించి పరస్పరము తెలియజేసికొని సమష్టిగా వ్యవహరించవలసి యున్నది. అందువల్ల ఉత్పత్తి పంపకము, వినియోగముల గురించి సమాచారము సేకరించి నివేదికలను సమర్పించుటకు ప్రపంచ ఆహార వ్యవసాయసంఘము ఒక సంఘమును నియమించుటకు తలపెట్టినది.

### ఆహారసమితి సంఘమునకు ఎన్నికలు

వాషింగ్టన్, నవంబరు 27: ప్రపంచ ఆహార సమితి సంఘమునకు ఆస్ట్రేలియా, డెన్మార్కు, ఈజిప్టు, ఫ్రాన్సు, ఇండియా మెక్సికో దేశములు తిరిగి ఎన్నుకోబడినవి. వైకౌంట్ బోస్ (మెల్బోర్న్) సంఘ గృహుడు.

### ఇంజనీర్ల సంచారము

న్యూఢిల్లీ, నవంబరు 27: దేశములో వివిధ ప్రాంతములందు అవలంబింపబడుచున్న పద్ధతులు అన్ని రాష్ట్రములందు ఇంజనీర్లకు తెలియుటకుగాను, కేంద్ర ప్రభుత్వ ఇరిగేషనుబోర్డు ఒక సంచార కార్యక్రమమును ఏర్పరుచ నిర్ణయించినది. ఈ సంచారములో పాల్గొనుటకు తమ ఇంజనీర్లను పంపవలసినదని రాష్ట్రములకు, కొన్ని పెద్ద సంస్థానములకు ఆహ్వానములు పంపబడినవి. ఇలాంటి పరిశీలనాసంచారమువల్ల ఒకరవలంబించుచున్న పద్ధతులు మరొకరికి తెలియుటే గాక, పరస్పరము చర్చించుకొని, దేశశ్రేయాభివృద్ధికి కూడ ఉపయోగకారిగా నుండునని భావించిరి. ఈ సంచారము వచ్చేనెల ఆరంభమునను డిశంబరు 26 న కొంతమంది ఇంజనీర్లు బయలుదేరి నాగపూరు, మదరాసు, బొంబాయి రాష్ట్రములలో ప్రాజెక్టులను చూచుటకు పర్యటించెదరు. రామపాద సాగరడాము నిర్మాణస్థలమును కూడ వారు పరిశీలించెదరు.

### తెగుళ్ల నివారణ మందులపై దిగుమతి పన్నుల రద్దు

న్యూఢిల్లీ, నవంబరు 28: పైరులకు పట్టుచీడలను, తెగుళ్లను నిర్మూలించు కొన్ని మందులపై ఒక సంవత్సరముకు దిగుమతి పన్నులను రద్దుచేయ భారతప్రభుత్వము నిర్ణయించినది.

## బొంబాయి తుపాను

### 17 తేదీన హెచ్చరించినట్లు వాతావరణశాఖ ప్రకటన

న్యూఢిల్లీ, నవంబరు 28: ఈ మధ్య బొంబాయిలో వచ్చిన తుపాను గురించి వాతావరణశాఖవారు నవంబరు 17 నే హెచ్చరిక చేసియుండిరి. తుపాను రానున్నదని బొంబాయి హార్బరువారికేకాక, సౌరాష్ట్రలోని కోస్తాలో నున్నవారికికూడ తెలియజేయుడమైనది. ప్రభుత్వాధికారులకు విమానాశ్రయములకుగూడ తెలియజేయుడమైనది. 19 సాయంకాలం అరేబియన్ సముద్రములో తుపాను వచ్చినదనినప్పటి నుండే బొంబాయి వాతావరణ కార్యాలయమువారు అతి అప్రమత్తులై యుండిరి. ఆకోస్తాలో కచ్చి ట్రావన్కూరుల మధ్యనున్న రేవులన్నిటికీ ఈ విషయము తెలియజేయబడెను. 21 సాయంకాలమే హార్బరుకు తుపాను ప్రమాదమేర్పడినదను తెలుపుచిహ్నమును కట్టవలసినదని బొంబాయికి తెలియజేయుడమైనది. ఎప్పటికప్పుడు వాతావరణమును గురించి శాంతాక్రూజ్ విమాన కేంద్రములకు తెలియజేయుబడుచూ వచ్చినది. విమానయానములు ఆపివేయబడినవి. 22న సాయంకాలము పెద్ద ప్రమాదము తెలుపుచిహ్నమును కట్టవలసినదని పరిసరప్రాంతరేవు పట్టణములకు తెలియజేయబడెను. ఈ సమయములో కొలాబాయందు గం॥కు 80 మైళ్ల వేగముతో జుహూయందు 94 మైళ్ల వేగముతో గాలి వీచినది.

### అస్పృశ్యతా నిషేధము

న్యూఢిల్లీ, నవంబరు 29: నేడురాజ్యాంగపరిషత్తువారు అస్పృశ్యతా నిషేధమును ప్రాథమిక హక్కుల ప్రకరణములో చేర్చిరి. దీనికిసంబంధించిన సూత్రము యిట్లున్నది. "జాతి, మత, కుల, లింగ, జననప్రదేశ విభేదములు పాటించబడరాదు. అట్లు పాటించినవారు శిక్షకు పాత్రులగుదురు."

ఎన్నికలు ప్రభుత్వ ఖర్చులతో జరుపబడవలెనన్న మరియొక ప్రతిపాదన త్రోసివేయబడెను.

### లండన్‌సభలో కమ్యూనిస్టులగలభా

లండను, నవంబరు 29: గతరాత్రి బ్రిటిషు యుద్ధమంత్రి షినవెల్ ఒకసభలో ఉపన్యసించుచుండగా కమ్యూనిస్టులు గలభాచేసిరి. "దేశమునకు తగినంత రక్షణ యుండవలెను. కమ్యూనిస్టుల మెప్పును పొందుటకు ఆయుధ విసర్జన చేయదలచలేదని కమ్యూనిస్టు మిత్రులకు తెలియజెప్పుచున్నాను" అని షినవెల్ చెప్పెను. "రష్యాతో యుద్ధము కావలెనువారు ప్రభుత్వములో ఒక్కరుకూడా లేరు. మనతో యుద్ధము రావలెనని రష్యాకూడా కోరుటలేదని మాకు తెలిసినదానినిబట్టి నమ్మకము చిక్కినది."

### కమ్యూనిస్టుపార్టీ

లక్నో, నవంబరు 28: కమ్యూనిస్టు పార్టీ గురించి వివిధ రాష్ట్రముల వైఖరి ఎట్టిదో కేంద్రప్రభుత్వమువారు విచారించుచున్నారట.

యు. పి. ప్రభుత్వమువారు సకాలములో కమ్యూనిస్టులపై తగుచర్య తీసికొనుటవలన ఆపార్టీ ప్రాబల్యము పోయినదనియు, గోరఖ్‌పూరులోనూ, తూర్పు జిల్లాలలోనూ, కమ్యూనిస్టులు సాగించిన అలజడిని అణచిననాటినుండియు శాంతికి భంగము లేదనియు, కమ్యూనిస్టు పార్టీలను నిషేధించుట మానుట అనునది రాష్ట్రప్రభుత్వములకే వదలవలెనని కేంద్రమునకు సూచన చేయబడినదనియు ఒక యు. పి. ప్రభుత్వోద్యోగి చెప్పెను.

### ఢిల్లీలోని కమ్యూనిస్టుల ఇండ్లు

న్యూఢిల్లీ, నవంబరు 28: దర్యాగంజ్‌లోని కమ్యూనిస్టు, ట్రేడ్ యూనియన్ కార్యకర్తల ఇండ్లను స్వాధీనము చేసికొనుచు ఢిల్లీలోని జిల్లామేజిస్ట్రేటు ఉత్తరువు నోటీసు జారీచేసెను. ఈ యిండ్లలో నివసించు కమ్యూనిస్టులు ప్రస్తుతము నిర్బంధములో నున్నారు. వారి భార్యలును, బిడ్డలును మాత్రమే ఈ యిండ్లలో నివసించుచున్నారు.

ఇట్లుచేయుట రాజకీయ ప్రతీకారమని కమ్యూనిస్టుపార్టీవారు ప్రభుత్వము నకు ఫిర్యాదుచేసిరట. యు. ప్రె.

### కమ్యూనిస్టు అరెస్టు

మదరాసు, నవంబరు 28: టి. ఆర్. గణేశను అను కమ్యూనిస్టు కార్మిక నాయకుడు నిన్నరాత్రి త్యాగరాయనగరు బజారులో రోడ్డులో సైదాపేట పోలీసులచే అరెస్టు చేయబడెను. ఈతను గత ఏప్రిలునుండి పోలీసుని తప్పించుకొని తిరుగుచున్నాడు.

### కమ్యూనిస్టు ఏజంట్ల అరెస్టు

చికాకోలు, నవంబరు 26: పర్లకిమిడిలోవున్న ఒకకమ్యూనిస్టునుండి పవర్ ఆఫ్ అటార్నీ పొంది, పార్టీని కలపలో అతనికున్న భూమిని అమ్ముచున్న పి. పి. నాగభూషణం, బి. కృష్ణమూర్తి అనువారిని స్థానిక పోలీసులు అరెస్టు చేసిరి. వారినుండి రూ 4000/-ల రొక్కం స్వాధీనం చేసికొనిరి. కేసు దర్యాప్తు జరుగుచున్నది.

## నెహ్రూ తీవ్ర హెచ్చరిక

1 వ పేజీ తరువాయి

ఈ పథకము క్రింద అవకాశము ఉన్నదని తెలుస్తున్నది.

### వాణిజ్యం, పౌరసత్వం

నెహ్రూపథకాన్ని బట్టి వర్తక వ్యాపార విషయాలలో ఇండియా కామన్వెల్తు దేశాలకు మిగిలిన అన్ని దేశాలకన్నా ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వవలసి ఉంటుంది. అయితే, బ్రిటను ఇండియాకు ఈ ప్రత్యేక ప్రాధాన్యతను ఇవ్వనప్పుడు, ఎంతకాలమని ఇండియా ఈ విధంగా బ్రిటనుకు ప్రత్యేక వాణిజ్య ప్రాధాన్యత ఇవ్వగలదు అని ఒక ప్రశ్న దీనివలన ఏర్పడుతున్నది. ఈ విషయములపై ప్రధాని నెహ్రూ వచ్చేవారం అసెంబ్లీ లేదా శాసన సభలో ప్రసంగించునప్పుడు, ఈ సమస్యలన్నిటినీ విశదీకరించునని తెలుస్తున్నది.

ఈ సందర్భములో ఇండియా పౌరులకు కామన్వెల్తు పౌరసత్వము నిచ్చుటకై ఆస్ట్రేలియా ప్రభుత్వం పార్లమెంటులో ఒక బిల్లును ప్రతిపాదించుట గమనించతగియున్నది.

### బ్రిటిష్ ప్రధానికి నెహ్రూ లేఖ

కామన్వెల్తులో ఇండియాకు ఉండగల సంబంధ బాంధవ్యాలలో కొన్ని అంశములను విశదీకరించవలెనని ప్రధాని పండిత నెహ్రూ బ్రిటిష్ ప్రభుత్వమునకు లేఖను వ్రాసినట్లు ఇక్కడ భావించబడుతున్నది. ఈ లేఖలో ప్రస్తావించబడిన అంశములను రాజ్యాంగపరిషత్తు కాంగ్రెస్ పార్టీ, కాంగ్రెసు కార్యవర్గము, ఆమోదించినవి. భారత దేశము తన రిపబ్లిక్ హోదాకు భంగము లేని పద్ధతిలో కామన్వెల్తులో ఉండుటకు తగిన మార్గమును సూచించవలెనని పండిత నెహ్రూ బ్రిటిష్ ప్రభుత్వమును కోరియుండును.

రాజ్యాంగ పరిషత్ కాంగ్రెస్ పార్టీలో కొందరు ఇండియా కామన్వెల్తులో ఉండవలెనని కోరుతుండగా, మరి కొందరు, కామన్వెల్తులో చేరినప్పటి కన్నా బయట ఉన్నప్పుడే కామన్వెల్తులో ఇండియాకు ఎక్కువ పలుకుబడి ఉంటుందనీ, ఇండియా కామన్వెల్తులో చేరితే అది సోవియట్ వర్గానికి అపోహలు కలిగించవచ్చును కనుక, స్వతంత్ర రిపబ్లిక్ గానే ఉండి అవసరమైన దేశాలతో పరస్పర సహకార ఒడంబడికలు చేసుకోవచ్చుననీ అభిప్రాయపడుతున్నారు.

బ్రిటిష్ రాజును కామన్వెల్తులో ప్రథమ పౌరునిగా పరిగణించుటకు చాలామంది ఇష్టపడలేదు. కొందరు ప్రప్రథమ పౌరుని హోదాను కామన్వెల్తు దేశాలన్నిటికీ వరుసగా ఇవ్వవలెనని ప్రతిపాదించిరి. కొత్త రాజ్యాంగం అమలులోకి వచ్చే ముందే కామన్వెల్తుతో ఇండియాకు ఉండవలసిన సంబంధాలు నిర్ధారణ కావలెనని ఇక్కడ సర్వత్రా అభిప్రాయ పడుతున్నారు. ఇండియా తాను రిపబ్లిక్‌గా ప్రకటించుకున్న తరువాత కామన్వెల్తులో చేరితే దానిని ఇతరులు బలహీనతగా ఎంచవచ్చునని ఇక్కడ భావిస్తున్నారు.

నెహ్రూపథకమును ఆమోదించవలసినదిగా కోరుతూ రాజ్యాంగ పరిషత్తులో ప్రత్యేకముగా నొక బిల్లు ప్రతిపాదించబడునని తెలియుచున్నది.

### అమెరికాపత్రిక వ్యాఖ్య

న్యూయార్కు, నవంబరు 28: 'కామన్వెల్తుతో ఇండియా నిర్వరించుకొనవున్న' సంబంధములపై, బ్రిటన్, బ్రిటిష్‌జాతుల భవిష్యత్తు చాలవరకు ఆధారపడియున్నది అని సుప్రసిద్ధ అమెరికా దినపత్రిక 'బాల్టిమోర్ సన్' వ్యాఖ్యానించుచున్నది.

ఆ పత్రికకు, భారతదేశ వ్యవహారములకు ప్రధాన విలేఖరియైన పైర్స్ జే, ఇట్లు వ్రాయుచున్నారు.

"కామన్వెల్తు పరిణామములు, ఈ శతాబ్దిసమస్యను నిర్ణయించు సంఘటనలు కాగలవు. స్వాతంత్ర్యమును పొందిన సంవత్సరాంతమునకే, భారతదేశము కామన్వెల్తు సంబంధములలో ఒక నూతనసాధ్యమును ప్రారంభించునదిగా తయారై యున్నది.

'భారతదేశము విడిబడిపోయిన, తక్కిన సామంతదేశములతో, కామన్వెల్తు పెద్ద మార్పు లేమియులేక పూర్వరూపముననే యుండగలదు. కాని భారతదేశము కామన్వెల్తులో సహకరించెనేని 'బ్రిటిష్ కామన్వెల్తు రూపమునశించి - ఇప్పటికే బ్రిటిష్ అన్న పేరు మాసిపోయినది గదా—దాని స్థానే ఒకబలవత్తరమైన స్వతంత్ర రాజ్యముల మహాకూటమి యేర్పడగలదు. లోగడ నున్న పరస్పరానుమానముల వాతావరణమంతయూ నశించి, పూర్వపు బ్రిటిష్ సామ్రాజ్యముకంటె ఈ మహాకూటమి బలవత్తరమైనశక్తిగా తయారు కాగలదు.

'భారతదేశ మెదుర్కొనవలసిన ప్రధాన సమస్య దాని ప్రజాబాహుళ్యము—ఈ ప్రజాబాహుళ్యమే అనేకము ప్రపంచము నందు ఒక బలవత్తరమైన శక్తిగా తయారు చేయుచున్నది.

ఇప్పటికే భారతదేశము ఒక పెంపవ లేదగతి అగ్రరాజ్యముగా పరిణమించినది.

## తూ. బెం. కాందిశీకుల విషయం

### ఉభయ డొమినియనుల మధ్య చర్చ

న్యూఢిల్లీ, నవంబరు 28: డిసెంబరు 6 న ఇక్కడ ఇండియా పాకిస్తానుల సమావేశము జరుగును. ఆ సమావేశములో తూ. బెంగాలు నుండి వచ్చుచున్న హిందూ శరణార్థుల విషయమై ప్రధానముగా చర్చ జరుగునట.

ముందుగా రేపు కలకత్తాలో ఈ విషయమై చర్చ జరుగనున్నది. అందులో పాకిస్తాను ప్రధాని లియాకతాలీఖాన్, ఎస్. పి. ముఖర్జీ, ప. బెంగాల్ ప్రధాని అయిన బి. సి. రాయ్‌గార్లు పాల్గొందురు.

ఉభయ డొమినియనుల మధ్య సరియైన సమాధానములు జరుగుస్థితి దాటిపోయినదనియు, రాగల సమావేశములో జరుగు తీర్మానములను అమలు జరుపుటకు కొంత ఒత్తిడి ఉండవలెననియు, తూర్పు పాకిస్తానుకు చెందిన ఒక అనధికార పెద్ద చెప్పెను.

### పాకిస్తాన్ ప్రధాని కలకత్తాలో ఆగడట

ఢాకా, నవంబరు 28: కరాచీకి తిరిగి వెళ్లునప్పుడు పాకిస్తాను ప్రధాని లియాకతాలీఖాన్‌గారు ప. బెంగాలు గవర్నరు డా॥ కాట్జూగారిని కలిసికొనుటకు యిదివరలో యేర్పాటులు గావింపబడి యుండెను. కాని తలవని తలంపుగా యేర్పడిన స్థితిగతులవల్ల అనుకొన్న దానికంటె ముందుగానే కరాచీ చేరవలసి వచ్చుటచేత ఆయన కలకత్తాలో ఆగడని తెలియుచున్నది. ఈ కారణమువల్లనే ఆయన తన తూ. బెంగాలు పర్యటనమును రెండు రోజులు తగ్గించుకొనవలసి వచ్చెనని చెప్పుచున్నారు. (అ. ప్రె.)

### పాకిస్థాన్ సమస్యలు

పెషావరు, నవంబరు 28: జనరలస్ గ్రాండ్‌ముఫ్తీ ప్రతినిధులగు వలీస్ హుస్సేన్, అబ్దుల్లా ఖురోషిగార్లు నిన్నయిచ్చటికివచ్చి పాకిస్తానుసమస్యల విషయమై సరిహద్దురాష్ట్ర ప్రధాని ఖాన్ అబ్దుల్ కయామ్‌ఖానుతో చర్చలు జరిపిరి. నేటి ఉదయము వారు కాబూలుకు బయలుదేరి వెళ్లిరి. అచ్చట వారు ఒక వారముందురని తెలియుచున్నది. అ. ప్రె.

## మహిళా మండలి

### హిందూధర్మ శాస్త్ర సవరణ వెంటనే జరుపగోరుట

మదరాసులో రాజాజిహాలు నందు ముద్దులక్ష్మిరెడ్డిగారి అధ్యక్షతను జరిగిన అ. భా. మహిళామండలి మదరాసు శాఖ సభాయందు శనివారంనాడు, హిందూ ధర్మశాస్త్ర సవరణ క్రొత్త శాసనసభకు విడువక యీ రాజ్యాంగ పరిషత్తు నందే చర్చించి ఆమోదించాలని కాంగ్రెసు అధ్యక్షుని, ఇండియా ప్రధాన మంత్రి కోరుచు తీర్మానించిరి.

బహుభార్యా నిషేధచట్టం గావించిన అ. కాశీశ్వరరావు గారిని అభినందించిరి. వైద్యవిద్యార్థులందరు చదువయినాక కొంతకాలం ప్రభుత్వంవారి వద్ద ఉపకారవేతనం పుచ్చుకొని గ్రామసీమలందు పని చేయునట్లు ప్రభుత్వంవారు నిర్బంధించాలని కోరిరి. కాలేజిలలో విద్యార్థులు విద్యార్థినులందరికి కూడ అట్టి నిర్బంధం చేయాలనిరి.

విద్యాసంస్థలందు చేర్చుకొనేటప్పుడు విద్యార్థుల దరఖాస్తులందు బ్రాహ్మణ అబ్రాహ్మణ ఇత్యాది జాతిభేదాలు సూచించే వ్రాతలుండరాదని సూచించిరి.

మదరాసు నగరంలో బస్సులందు స్త్రీలకు 1/3 వంతు స్థానములు ప్రత్యేకించాలని కోరిరి.

---

ఎన్ని బలహీనత లున్నను, ఈ అల్పకాలమునందు ఎంతో ఆశ్చర్యకరమైన శక్తి సంపన్నతను ప్రదర్శించి యున్నది. బ్రిటిష్ ప్రభుత్వము తొలగిపోగనే, భారతదేశము నిస్సహాయమగు అరాచకము కాగలదని పాతపద్ధతి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు చెప్పిన జోస్యమును లన్నియూ వట్టివలకంతులుగా పరిణమించినవి. ఇప్పటికే ఆసియాఖండమున కంతకునూ, భారతదేశము సైతికరంగమున నాయకత్వము వహించియున్నది. త్వరలో రాజకీయ నాయకత్వమును కూడ సిద్ధించుకొనవున్నది.

బ్రిటిష్ సామ్రాజ్యానికి కీటమునదు దాసోహ మనుటకు భారతదేశము ఖండితముగా నిరాకరింపవచ్చును. ఏయే బంధనములను తెంచివేయుటకు ఆ దేశపు మహానాయకుడు మహాత్మా గాంధీ, కారాగారము లంఘించి, జీవము ల్పించియున్నాడో ఆయుధగులను చేరకొనుటకు భారతదేశము శీఘ్రముగా ప్రయత్నింపగదు.

## రాజ్యాంగ పరిషత్తు

### సమావేశానికి కోరంలేదు

న్యూఢిల్లీ, నవంబరు 29: రాజ్యాంగ పరిషత్తు నేడుదయం సమావేశమైనప్పుడు కోరం లేకపోవుటచే మునాయిదా రాజ్యాంగ చర్చ సాగించటానికి ముందు 15 నిమిషములపాటు సభ నిలుపవలసివచ్చినది.

సమావేశం కొద్ది నిముషములు సాగగనే పండిత కుంజ్రూ లేచి, కోరం వున్నప్పటికీ ఇంత కొద్దిమందిసభ్యులతో రాజ్యాంగమునుగురించి చర్చించటమువల్ల ప్రయోజనములేదని చెప్పెను. అపుడు ఉపాధ్యక్షుడు హెచ్. సి. ముఖర్జీగారు గంట కొట్టించిరి. అయినప్పటికీ తగినంతమంది రాకపోవుటవల్ల సభ 15 నిమిషములు వాయిదావేసిరి. రేపటినుండీ సభ ఉదయము 9-30 గంటలనుండి, 1-30 గంటల వరకు, సమావేశమవునని ముఖర్జీగారు తెలియజేసిరి. మధ్యాహ్నము 3 గం॥ నుండి 5 గంటలసేపు సభ సాగించవలెనని అందరు అంగీకరించిరి.

ప్రస్తుత సమావేశముడిశంబరు 18 వరకు సాగి, 15 రోజుల అనంతరము తిరిగి డిశంబరు 27-న సమావేశమవునని ఉపాధ్యక్షుడు ముఖర్జీగారు ప్రకటించిరి.

### పంటలో భూస్వామి కౌలుదార్ల భాగములు

కలకత్తా, నవంబరు 27: వచ్చే వరి పంటలో భూస్వామి, కౌలుదార్లకు రావలసిన భాగముల గురించి తగాదా వచ్చిన ఆ సందర్భమున తమ ప్రభుత్వము అవలంబించ దలచిన విధానమును పశ్చిమ బెంగాలు సివిల్ సప్లయి మంత్రి ప. బెంగాలు వరి వ్యవసాయ దారుల సభలో తెలిపెను. విత్తనముల ఖరారు తగ్గించిన మీదట మిగిలిన పంటను మూడుగా విభాగించి, ఒక భాగము భూస్వామికి, ఒకభాగము కౌలుదారునకు, చెందవలెను. మిగిలినది. మిగిలిన భాగము నాగళ్లు ఎడ్లు ఎరువులు సప్లయి చేసినవారికి చెందవలెను. ఈ పద్ధతిమీద తగాయిదాలు పరిష్కారము చేయబడును. ఒకకమిటీ సహాయముతో జిల్లాకలెక్టరు తగాదాలకు తీర్పును.

### "రైల్వే సమ్మె జరుగరాదు"

#### డా॥ సురేశచంద్రబానర్జీ ప్రసంగం

బొంబాయి, నవంబరు 29: భారత జాతీయ రైల్వే కార్మిక ఫెడరేషనువారి ప్రథమ సమావేశము నేటి మధ్యాహ్నము ఆరంభమైనది. దాని అధ్యక్షుడు, డాక్టరు సురేశచంద్రబానర్జీ ఉపన్యసించుచు, రైల్వే సమ్మె ఇప్పుడు జరుగరాదనుటకు కారణము లిట్లు వివరించెను:

"రైల్వేపనివారికి ధాన్యరుకొణ వసతు లంతర్గించినందుకు జనవరి 1 ని అసమ్మతి దినముగా ఎంచవలెననియు, సమ్మె నిర్ణయమునకు బాలటుచేయవలెననియు అ. భా. రైల్వే ఫెడరేషనువారు తీర్మానించిరి. కాని ధాన్యరుకొణవసతులు తగ్గించుసూచనను చేసిన కమిటీలోని 3 గిలో భా. జా. ట్రే. యూ. కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి ఒకడైయున్నాడు. ఆయన కార్మికుల క్షేమమునకు విరోధిగా నుండడు. ఏమైనను నేడు రైల్వే సమ్మెవలన చాలా నష్టమున్నది. హైదరాబాదు సమస్య పరిష్కారమైనదిగాని కాశ్మీరు సమస్య అట్లే యున్నది. పాకిస్తానువారు కాశ్మీరులో తమ బలములను హెచ్చించునట్లు కనపడుచున్నది. అట్లు జరిగినచో ఇండియా ప్రభుత్వమేమి చేయునో తెలియదు. తూ. పాకిస్తాన్ కాందిశీకుల సమస్యకూడ తీవ్రముగానే ఉన్నది. అంతర్జాతీయ పరిస్థితి అపాయకరముగా నున్నది. కనుక రైల్వేసమ్మె జరుగరాదు. పైపెచ్చు రైల్వేల కదలికకు అంతరాయములు కలుగవలెను. వస్తువులు కదలినచో ఉత్పత్తి పెరిగి ధరలు తగ్గును. ఇప్పటి ప్రభుత్వమునది, మన ప్రధాని కార్మికుల కనుకూలుడు. కనుక మన సమస్యలను వారు శ్రద్ధతో పరిష్కరించగలరు. సమ్మెవలన వినాశనముతప్ప మరియొకటి వుండదు."

రాజకీయాశయములతో కమ్యూనిస్టు, సోషలిస్టు మొదలగువర్గములవారు రైల్వే ఫెడరేషను కాంగ్రెసు పక్షమునకును, ప్రభుత్వమునకును విరుద్ధముగా నడుపుచున్నారనియు, విద్రోహులు నడుపు ఫెడరేషనును గుర్తించిన ప్రభుత్వము జాతీయ రయిల్వే ఫెడరేషనును గుర్తించుటలేదనియు డా॥ బానర్జీ చెప్పెను.

### ఐర్లెండు క్రొత్తగా రిపబ్లిక్ అగుటలేదని డీవాలెరా

ఈస్టుడానెగల్ (ఎయిరు) నవంబరు 29: 1937 సం॥పు ఎయిర్ రాజ్యాంగ విధానము ననుసరించి, 1937 సం॥ము నుండి ఎయిర్ రిపబ్లిక్‌గా నుండెనని, ఎయిర్ రిపబ్లిక్ కన ఎయిర్ ప్రభుత్వము గావింపబోవుచున్న ప్రకటనలో క్రొత్త ఏమియు లేదని మాజీ ఎయిర్ ప్రధాని ఎమ్మన్ డీవాలెరాగారు గతరాత్రి యిచ్చట చెప్పిరి.

# పాలస్తీనాలో యుద్ధ విరమణ యత్నాలు

## జెరుసలేములో యూదులు అరబ్బు మంతనాలు

టెల్ అవీవ్, నవంబరు 29: ఈజిప్టు సేనలతో పోరి విజయములు సాధించుకొన్న దక్షిణ పాలస్తీనా నెగెవ్ ప్రాంతమున యుద్ధవిరమణకు ఐక్యరాజ్య యుద్ధవిరమణ పరిశీలకులు చేసిన సూచనలను ఆమూలాగ్రముగా ఇజ్రాయిలు ప్రభుత్వము వారామోదించిరి. ఫాలూజావద్ద చిక్కుకొనిపోయిన ఈజిప్టుసేనల సహాయార్థము నిరాయుధబలగమును పంపుటకు ఇజ్రాయిలు ప్రభుత్వము అభ్యంతరము చెప్పరనియు సాయుధబలగములు పంపినచో ఈజిప్టుసేనలు తమ సైనిక స్థావరములను బలపరుచుకొనుననియు ఒక సైనికాధికారి చెప్పెను.

లండను, నవంబరు 29: పాలస్తీనాను రెండు రాజ్యములుగా విభజించుటకు లేక్ సక్సెస్‌వద్ద సర్వప్రతినిధి సభవారు నిర్ణయించి నేటికి సరిగా ఏడాది ఐనది. నేటి దినమున ఇజ్రాయిలువారు అధికారరీత్యా తమకు సర్వప్రతినిధి సభా సభ్యత్వము ఇప్పించవలెనని విజ్ఞాపనము చేయుచున్నారు. ఈ విజ్ఞాపనలేఖ సర్వప్రతినిధి సభకు ప్రధాన కార్యదర్శిఅయిన ట్రిగ్వీ గారికి పంపబడి, విచారణకు భద్రతాసంఘ లిక్కి అందజేయవలసినదిగా కోరబడెను.

జెరుసలేములో సమగ్రమైన యుద్ధవిరమణ సాధించుటకు గాను యూదు అరబ్బు మంతనములు చేసుగా జరుగుచున్నవట. త్వరలోనే ఈ ప్రయత్నములు సఫలములు కావచ్చుననియు, మంతనములు అనుకూలముగా సాగుచున్నవనియు తెలియుచున్నది.

గడచిన 24 గంటలకాలములో నూ జెరుసలములోని అన్ని రంగములలో నూ యూదుల దాడి తీవ్రముగా సాగినట్లును, అరబ్బుల తిరుగుదాడులలో యూదులకు బలమైన నష్టములు కలిగినట్లును ట్రాన్స్ జోర్డాన్ ముఖ్యపట్టణమైన అమ్మాన్ నుండి వార్తలు వచ్చియుండెను.

## యూదులపై యుద్ధము: ఇరాక్ సంసిద్ధత

బాగ్దాదు, నవంబరు 28: పాలస్తీనాలో రాజీకి ఒప్పుకొనుటలో అరబ్బులు గొప్ప పొరపాటు చేయుచున్నారని నేడు ఇరాకు పార్లమెంటులో ప్రధాని ముజాహిద్ పచాచీ ఉద్ఘాటించుచు, అరబ్బులందరను సంఘటించి యూదులతో పోరుటకు ఇంకను అవకాశమున్నదని చెప్పెను. పాలస్తీనాను రక్షించుటకును విముక్తి నొందించుటకును అరబ్బురాజ్యములు రాజకీయముగాను సైనికముగాను ఏకము కావలెనని ఇరాకు పార్లమెంటు తీర్మానించెను. దీని విషయమై అరబ్బు రాజ్యములను ఇరాకు ప్రభుత్వము హెచ్చరించి పాలస్తీనాలో సత్వర యుద్ధము సాగించుటకు ప్రయత్నించనున్నదట.

## ఇజ్రాయిలు గురించి బ్రిటను అమెరికాల భిన్నదృష్టి

లండను, నవంబరు 28: ఇజ్రాయిలు రాజ్యము రష్యాతో చేరవచ్చునని బ్రిటను అమెరికాలు రెండును భయపడుచున్నవి. అయితే, ఇది నివారించుటకుగాను తూర్పు సముద్రముకు ముఖద్వారమైన దక్షిణ నెగీవ్ ఇజ్రాయిలు అధీనము కాకూడదని బ్రిటిషువారును, ఇజ్రాయిలు ప్రభుత్వములోని సోవియటు ప్రతికూలపక్షమునకు విరుద్ధముగా మితవాదపక్షములు బలపడవలెనని అమెరికావారును భావించుచున్నారు.

విశ్రాంతికొరకు సముద్రతీరమునకు పోయిన బ్రిటిషు విదేశాంగ కార్యదర్శి ఎర్నెస్టు బెవిన్ తిరిగి రాగానే ఈ విభేదములను గురించి విచారించునట.

## అరబ్బులకు అమెరికా సహాయం

వాషింగ్టన్, నవంబరు 28: అమెరికా ప్రభుత్వమువారు అరబ్బు శరణార్థులకు 120 మిలియ. 160 లక్షల డాలర్ల విలువ సహాయము చేయగలరట. ఈసహాయమునకు అమెరికను కాంగ్రెసువారు అనుమతించవలసియున్నదని తెలియుచున్నది.

## 'జార్జిరాజు ఆరోగ్యం

లండన్, నవంబర్ 28: నేటి ఉదయం ఎలిజబెత్‌రాణి మార్గరెట్ రాకుమారి, బకింగ్‌హాం భవనమువద్ద ఉన్న సెంట్ మైకేల్సు చర్చిలో ప్రార్థనలకు హాజరైనారు కాని జార్జిరాజుగారు అస్వస్థతవలన రాజభవనములోనే నిలిచిపోయెను. ఆయన కాలులో రక్తప్రసారము సరిగా లేనందువల్ల గెంతుచారములనంచి ఆయన ఎక్కడకును కదల్చుటలేదు. ఆయనకు చికిత్సచేస్తున్న వైద్యులు ఆయన శరీరస్థితిని గురించి రేపొక ప్రకటనచేసెదరు.

# హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్

## కార్యవర్గంపై విశ్వాస రాహిత్య తీర్మానం

హైదరాబాద్, నవంబరు 27: అఖిల హైదరాబాద్ కాంగ్రెసు సంఘ సభ్యుడు హరిశ్చంద్ర హెడాగాను, నవంబరు 30 న జరుగనున్న సంఘసమావేశమందు సంస్థాన కాంగ్రెసు కార్యవర్గంలో అవిశ్వాసం తెలియజేయుచు ఒక తీర్మానమును ప్రతిపాదింపదలచినానని నోటీసుయిచ్చెను.

ఆతీర్మానమిట్లున్నది. సంస్థాన కాంగ్రెస్ ప్రథమ వార్షిక సమావేశంలో ఆమోదించబడిన 'పోరాటం' తీర్మానమును అనులుజరుపుటలో సంస్థాన కాంగ్రెసు కార్యవర్గం తన బాధ్యతలను పక్రమంగా నిర్వర్తించలేదని తెలుపుటకు యీ సమావేశం విచారించుచున్నది. పోరాట కార్యక్రమం అఖిల హైదరాబాద్ కాంగ్రెసు సంఘ ఆమోదం పొందవలెననీ, అట్లు జరిగిన తర్వాతనే దానిని ఆచరణలో పెట్టవలెననీ ఈ 'పోరాటం' తీర్మానంలో ఒక ముఖ్య సవరణచేయబడెను. దీనిమీద చర్చ జరిగిన తర్వాత బాధ్యతగల వాయిదాటు పోరాట కార్యక్రమం అఖిల హైదరాబాదు ఆమోదం ప్రకారమే కార్యవర్గం నడపునని చెప్పుటచే తీర్మానం సవరణ లేకుండా యథాతథంగా ఆమోదించబడినది. కాని కార్యవర్గంగాని, కార్యాచరణ సంఘంగాని పోరాట కార్యక్రమాన్ని గురించి ఏ సందర్భంలో నూ ఈ అఖిల హైదరాబాదు కాంగ్రెసు సంఘమునకు తెలియజేయలేదు. అసలు యీ రెండు సంఘములను విశ్వసించలేదుకూడా. ఇంతేగాక ఎప్పుడూ కాంగ్రెస్ సంఘ ఎన్నిక పదవులలో నుండని, ప్రజావిశ్వాసం చూరగొనని కొంతమంది వ్యక్తులతో ఏర్పాటు చేయబడిన కార్యాచరణ సంఘమునకు ఈ ప్రముఖ బాధ్యత అప్పగించబడినది. కార్యవర్గ సభ్యులుగాని, కార్యాచరణ సంఘ సభ్యులుగాని సంస్థానములోనుండి సత్యాగ్రహం చేసి ప్రజలకు కాంగ్రెస్ సభ్యులకు మార్గదర్శకంగా నుండుటకుబదులు ప్రజలను, కాంగ్రెస్ సభ్యులను వారి కర్మమునకు వారిని వదలి సంస్థానమునకు బయటనుండి సంస్థానంలో జరుగుచున్న సత్యాగ్రహోద్యమమునకు ప్రోత్సాహమివ్వకుండా, సరిహద్దు సంఘటనలకు ప్రాముఖ్యత అంటగట్టుట జరిగినది. ఈ చర్యలు అఖిలభారత కాంగ్రెస్ సంఘవిధానమునకు వ్యతిరేకమేగాక, సంస్థాన కాంగ్రెసు నిబంధనావళిలోని రెండవనిబంధనను పూర్తిగా నిర్లక్ష్యంచేయుటకూడనని స్పష్టం చేయుచున్నవి. పోరాటం అంతమైనతర్వాత కార్యాచరణసంఘంచేసిన అస్తవ్యస్తపనులవలన బాధపడిన ప్రజానీకమునకు క్షమాపణ తెలియజేయుటకు మారుగా కార్యవర్గం కార్యాచరణ సంఘ చర్యలను ఆమోదించినది. ఈ కారణాలవలన సంస్థానకాంగ్రెస్‌వంటి పెద్దసంస్థను ప్రజాస్వామిక పద్ధతులమీదనడపగల సామర్థ్యం కార్యవర్గమునకు లేదని పూర్తిగా రూఢి అగుచున్నది. అందుచే ఈసమావేశం కార్యవర్గంలో అవిశ్వాసం తెలియజేయుచున్నది." ఇదేగాక సమావేశంలో ప్రతిపాదించెదనని మరి రెండు తీర్మానములను కూడ పంపెను.

## సంస్థానప్రజలు పంపుకొను అర్జీలు

ఔరంగాబాద్, నవంబరు 28: హైదరాబాద్ సంస్థానంలో గల ప్రభుత్వ కార్యాలయములన్నీ, ఇంగ్లీషు, తదితర ప్రాంతీయ భాషలలో ప్రజలు పంపుకొను విజ్ఞప్తులను, అర్జీలను అంగీకరించ వలసిందిగా హైదరాబాద్ ప్రధాన సివిల్ పరిపాలనాధికారి ఒక సర్క్యులరు జారీచేసిరి. సంస్థానంలో రాజభాషగా ఉర్దూ ఉండునప్పటికీ ప్రాంతీయ భాషలలో పంపుకొను అర్జీలను నిరాకరించ రాదని పైసర్క్యులరులో స్పష్టం చేయబడెను. ఉర్దూభాషలో గాక ప్రజలు యితర భాషలలో వ్రాసి పంపుకొను అర్జీలను నిరాకరించుట యింతవరకు సంస్థానంలో వాడుకగా నుండెడిది.

## క్రొత్త కాల్వ

బగోటా (కొలంబియా), నవంబరు 28: పెనామా కాలువకు ఆగ్నేయమున 200 మైళ్ల దూరములో అట్లాంటిక్ పెసిఫిక్ మహాసముద్రములను సంధించు క్రొత్త కాల్వను నిర్మించుటకై జరుగుచున్న సర్వేలలో నూతనఘట్టము రేపు ప్రారంభమగును. నార్తికొ, సైనికసంస్థ డైరెక్టరు జనరల్ విల్సన్ పెనామానుండి వచ్చియున్నాడు. ఈలెడు అమెరికన్ మిలిటరీ ఇంజనీరుతో కలిసి కాల్వను త్రవ్వు అవకాశములను పరిశీలించును. పెనామా కాలువను రక్షించు అమెరికను స్థావరములకు కవుళ్లు పొడిగింప పెనామా నిరాకరించిన తరువాత లాకులు అవసరము లేనట్టి సులభముగా రక్షింపవీలగునట్టి క్రొత్తకాల్వను నిర్మించుట ఉత్తమమని అమెరికా సైన్యములెంచినట్లు గత క్రిస్మస్ సమయమున వాషింగ్టనులో చెప్పుచుండిరి.

# భారతప్రభుత్వ విధానం కార్మిక వర్గవ్యతిరేకమని సోషలిస్టుల తీర్మానం

## తమ తీర్మానములను ప్రధానమంత్రికి నివేదించుటకు బొంబయి సభ నిర్ణయం

బొంబాయి, నవంబరు 28: 'ప్రభుత్వ విధానము కార్మిక వ్యతిరేకమై నియంతృత్వ పంథాతో నడపబడుచున్నద'ని నేడిచ్చట ఏర్పాటు చేయబడిన సోషలిస్టు కార్యకర్తల సమావేశమునందు జయప్రకాశ్ నారాయణ్ ప్రసంగించిరి. "కార్మికవర్గముయొక్క అభిలాషలను మన్నించుటకు మీదు, స్వతంత్రభారత జాతీయ ప్రభుత్వము, వారికిగల సమ్మెచేయు హక్కును కూడ నిరాకరించి, కార్మికవర్గమును అణచివైచుటకు కంకణము కట్టుకొనియున్నది. ఇది చాలక కార్మికవర్గమునందు చీలికలు తెచ్చుటకు, అభూతములైన కార్మిక వ్యవస్థలను సృష్టించుచున్నది." అని వారు విమర్శించిరి.

ఈ సాయంత్రము ముగింపు చేయబడిన కార్మిక నాయకుల సమావేశమును గూర్చి ముచ్చటించుచూ, 'ఈ సంఘము బలయుతము కాగలదని కార్మికుల దృక్పథమును ప్రభుత్వమునకు నచ్చజెప్పుటకు సమర్థము కాగలదనీ, తాను నమ్ముచున్నాననిరి.

'ఈ సమావేశపు తీర్మానములు త్వరలో ప్రధానమంత్రికి అందజేయబడగలవు. మన భావికార్యక్రమము మరియొక కార్యకర్తల సమావేశములో, త్వరలో నిర్ణయింపబడ గలదు' అని తెల్పిరి.

ప్రభుత్వవిధానము కార్మికవర్గమునకు ఏ విధముగానూ ప్రయోజనకారిగా లేదు. దొంగవర్తకులకు, ప్రభుత్వోద్యోగులకు ఆదాయకరముగా నున్నది. ఈ సమావేశమునకు అధ్యక్షత వహించిన యస్. యం. జోషి, 'తన పొట్ట తాను పోసుకొనుచూ తక్కిన సంఘము నంతనూ ఉద్ధరించుట కార్మికుని ప్రధాన ధర్మమైయున్నది. పెట్టుబడి విధానమువల్ల యేర్పడిన, సాంఘికాన్యాయముల నన్నిటినీ రూపుమాపుటకు, పరిశ్రమల నన్నిటినీ జాతీయము చేయు టొక్కటియే అనుసరింపదగిన పరిష్కార మార్గము అనిరి.

తరువాత, ప్రజారక్షణ చట్టము పెట్టుబడిదారుల రక్షణ చట్టమనీ, మహాత్ముని అహింసా బోధనల విస్మరించి కాంగ్రెస్ ప్రభుత్వము పోలీసు, మిలిటరీ బలముతో హింసా మార్గమున కార్మికోద్యమము నణచుచున్నదనీ ప్రసంగించిరి.

తిండికై అల్లాడుచూ అసంతృప్తులగుచున్న కార్మికుల పరిస్థితి గమనించవలయునని ప్రభుత్వమునకు విజ్ఞప్తి చేసిరి.

మణిబెన్ కేరాగారు 'కార్మికు లందరూ ఐక్యతతో తమ పాదములపై తాము నిలబడవలయును నని, కార్మిక నాయకులమని దొంగవేషములు వేసుకొని తిరుగు అవకాశవాదుల మాటలునిని మోసపోవద్దనీ తెల్పిరి:

## దేశములో మరియొక కార్మిక సంస్థ

### కార్మిక నాయక సమావేశ తీర్మానాలు

బొంబాయి, నవంబరు 28: నేటి సాయంకాలముతో, ఇచ్చట రెండురోజులుగా జరిగిన కార్మిక నాయకుల సమావేశము పూర్తిఅయినది.

డిసెంబరు 24, 25, 26 తేదీలలో కలకత్తాలో మరియొక కార్మిక సమావేశము జరిగి అ. భా. ట్రే. యూనియను వంటి సంస్థ మరియొకటి. నెలకొల్పబడి ఇప్పుడున్న సంస్థకంటె శ్రామికుల కొరకు సమగ్రముగా పాటుపడునని తెలియుచున్నది.

ఎస్. ఎమ్. జోషి అధ్యక్షతను నేడు పూర్తి అయిన సమావేశము ఈ క్రింది తీర్మానములు చేసినది.

ఇండియాలోని ఆర్థిక సమస్యలకు సోషలిస్టు ఆర్థిక విధానమే విరుగుడు.

ద్రవ్యోల్బణ నిరోధమునకు అధికోత్పత్తియు, న్యాయమైన పంపకమును, శక్తికి అనుగుణమైన పన్నుల విధానమునూ అమలు జరుగవలెను. సైనికుపుస్తాలలో సగము తగ్గించి, ప్రభుత్వ నిర్వహణలో క్రొత్త పరిశ్రమలు నెలకొల్పుటలతోనూ, ఆధారపరిశ్రమలతోనూ వెంటనే ఆరంభించి పరిశ్రమలన్నియు జాతీయముచేసి, ఎస్టేటు దిగుమతులన్నియు ప్రభుత్వ యాజమాన్యము క్రింద జరిగినచో అధికోత్పత్తి జరుగును.

న్యాయమైన పంపకము జరుగుటకుగాను ప్రభుత్వమువారు ముఖ్యపదార్థములన్నిటిని సేకరించి, నగల కంట్రోలు లేవనెత్తు విధానములు అమలు జరుపవలెను.

ఆదాయములకు అనుగుణముగా పన్నులను, బాధ్యపన్నులనూ, వ్యాపారపన్నులనూ హెచ్చించవలెను, గృహనిర్మాణము విస్తరించినచో ద్రవ్యోల్బణము తగ్గును.

కార్మిక వివాదములు నిర్బంధముతో గాక స్వేచ్ఛగా పరిష్కరించబడవలెననియు, సమ్మెలను నిషేధించరాదనియు, పారిశ్రామిక శాంతి పథకమందలి తమ బాధ్యతలను ప్రభుత్వము నిర్వర్తించునవరకును కార్మికులను తప్పు పట్టరాదనియు, పోటీ కార్మికసంస్థలను ప్రోత్సహించుట కార్మికుల హక్కులకు భంగమనియు, సెంట్రల్ పే కమిషనువారి సూచనలను సర్వత్రా అమలుజరుపవలెననియు కూడా తీర్మానములు జరిగెను.

## జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ మహాసభలు

అహమ్మదాబాదు, నవంబర్ 28: కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నిక కారణముగా వాయిదా వేయబడిన జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు మహాసభలు డిసెంబర్ 1, 2, 3 తేదీలలో ఇచ్చట జరుగగలవు. వీనితోపాటు, 1919 సంవత్సరమున సర్దార్ పటేల్‌గారిచే వ్యవస్థీకరింపబడిన 'బొంబే. బరోడా, మధ్యపరగణాల రైల్వే ఉద్యోగుల సంయుక్త సంఘముయొక్క మహాసభలుకూడ ఏర్పాటు చేయబడినవి. జాతీయపక్షమునకు చెందిన తోలుపనివారలసంఘముయొక్క సమావేశములు గూడా వీటితోపాటే జరుగును, భారత ప్రభుత్వ కార్మికమంత్రి అహమ్మదాబాద్ నేత కార్మికులసంఘముయొక్క 32 వ వార్షికోత్సవమునందు పాల్గొనుటకు డిసెంబరు 4 వ తేదీన అహమ్మదాబాదుకు వత్తురు.

జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి ఖాండూభాయ్ దేశాయిగారు పత్రికా విలేఖరులతో ఇట్లు తెల్పిరి.

"మనము దేశమున అతిక్లిష్టమైన క్లిష్ట సమస్య లేర్పడియున్న ఈ సమయమున సమావేశమగుచున్నాము వివిధ పరిశ్రమలకు చెందిన పదిలక్షలపై చిలుకు సభ్యత్వముతోనూ, 700 ట్రేడ్‌యూనియన్ సభలకు చెందిన 185 మంది కార్యవర్గసభ్యులతో ఈ మహాసంస్థ విలసిల్లుచున్నది. కార్మికుల నెదుర్కొనుచున్న సమస్యలన్నిటినీ ఈ సమావేశము పరిష్కరించగలదని ఆశించుచున్నాము. అఖండ ఆసియా కార్మిక సమితి నిర్మాణమునకు ఈ సమావేశము నందు అంగీకరింపబడు తీర్మానములు ప్రాతిపదికలు కాగలవు. రైల్వే సమ్మె అత్మనాశకరమైనది. 'సర్వసమగ్రమైన రైల్వే కార్మికుల సమ్మె సాగింపబడునని బెదరించుచున్నారు. దేశము క్లిష్టమైన ఆర్థిక సమస్యలలో నడచుచున్నది. ఇట్టి స్థితిలో ప్రధాన సరఫరాలను స్తంభింపజేయు ఇట్టి చర్య ఆత్మవిధ్వంసకమైనది. జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ కార్మిక వర్గమునకు సక్రమమైన పంథాను సూచించగలదని ఆశించుచున్నాను.

'ఈ స్థితిలో నేరకమైన సమ్మెలును చేయరాదు. అవి జాతీయ క్షేమమునకు భంగకరములు. సోషలిస్టుపార్టీ వారుకూడ కమ్యూనిస్టులతో చేతులుకలిపి వారి మార్గములనే అనుసరించుచున్నారు పార్టీ ప్రయోజనములకొరకు, కార్మికవర్గములను ఉపయోగింపచూచుచున్నారు. ధరలు విపరీతముగా పెరిగిపోవుటచేత కార్మికులు ఇక్కట్లు పడుచున్నమాట యథార్థమూ కాదనరు కాని సమ్మెలు పరిష్కార మార్గము కాజాలవు. ఉత్పత్తిని పెంపొందించి, నోట్లమున్నరమును తగ్గించుటకు ప్రభుత్వమునకు తోడ్పడవలయును.'

రైల్వే ధాన్య దుకాణముల సంగతి ముచ్చటించుచూ, 'ఇవి అవినీతికిని, లంచగొండితనమునకు నూ నిలయములుగా పరిణమించినవి' అనిరి.

## పాకిస్థాన్ వైమానిక లకు అమెరికాలో శిక్షణ

మియామి (ఫ్లోరిడా, అమెరికా), నవంబర్ 28: ఫ్లోరిడారాష్ట్రం (అమెరికా) లో పాకిస్థాన్ వైమానికులకు శిక్షణనిచ్చుటకు గల సౌకర్యాలను పరిశీలించుటకై వచ్చిన పాకిస్థాన్ వైమానికోద్యోగి కెప్టెన్ హైదర్‌రజా ఇప్పుడు మియామిలో నున్న మూడు విమానాశ్రయాలను పరిశీలిస్తున్నాడు. ఫ్లోరిడాలో ఇతర విమానాశ్రయాలను కూడా తాను పరిశీలించనున్నాననీ, అమెరికా దక్షిణప్రాంతపు శీతోష్ణస్థితి పాకిస్థాన్‌లోవలెనే ఉండి, శిక్షణకు ఎంతో అనువుగా ఉన్నదనీ, అతను తెలియజేసెను. శిక్షణ పొందుటకై పాకిస్థాన్ వైమానికుల మొదటిజట్టు 22 మంది రెండు వారాల్లో అమెరికా చేరగలరని అతను చెప్పెను.

గౌహతి, నవంబరు 29: [illegible] నుండి అస్సాముకు [illegible] అమలుజరుపబడును. ప్రథమమున ఒక పట్టణ ఒక గ్రామప్రాంతిం[illegible] జరిపి క్రమేపి రాష్ట్రమంతట విస్తరింపబడును.

# నిజాంలో ధాన్యసేకరణ పద్ధతి

## సవరించుటకు మిలిటరీ ప్రభుత్వ అంగీకారం

హైదరాబాద్, నవంబరు 27: సంస్థానంలో ప్రస్తుతమున్న ధాన్య సేకరణ పద్ధతిని కొన్ని విషయాలలో సవరించుటకు మిలిటరీ ప్రభుత్వం అంగీకరించినదని తెలియుచున్నది. మెట్టనూగాణి భూముల లో కనీససంఖ్యగల యెకరములుగల రైతులనుండి ధాన్యమును సేకరించకుండా నుండుటకు ప్రభుత్వం అంగీకరించినదట. సంస్థానంలో ఆహారధాన్యాల ధరలను చుట్టుప్రక్కలరాష్ట్రములలో గల ధరలతో సమానంగా నుండునట్లు నిర్ణయించుటకు ప్రభుత్వం ప్రయత్నించుచున్నదని కూడ తెలియుచున్నది.

## ఏలూరులో బియ్యం బస్తా రు 50 లు

ఏలూరు, నవంబరు 29: పట్టణంలోని కార్మికులు, పేదలు గత మూడు దినముల నుండి చిల్లర దుకాణాలలో బియ్యం దొరకక అతి యిబ్బంది పడుచున్నారు. మిల్లు యజమానులు, టోకు వ్యాపారస్థులు ధాన్యంధరలు యిటీవల హెచ్చింపబడుటచే బియ్యం ధరలు యింకా పెంచబడునని ఆశించుచు చిల్లర దుకాణదార్లకు బియ్యం అమ్ముట లేదని తెలియుచున్నది. ప్రస్తుతం బియ్యం బస్తా రు. 50 ల ధరకు అమ్ముచున్నది. నిన్న కొమ్మారెడ్డి సూర్యనారాయణగారు రు. 400 ల బియ్యమును తెచ్చి దానిని పేదలకు పంచిరి. మిల్లు యజమానులు చిల్లర దుకాణదార్లకు బియ్యం అమ్మునట్లుగా వారిపై ఒత్తిడి చేయుటకుగాను ప్రత్యేక సిబ్బందిని నేడు కలెక్టరుగారు నియోగించినారు.

## గుంటూరుజిల్లా కాంగ్రెసు కార్యవర్గ సమావేశము

చిలకలూరిపేట, నవంబరు 23: గుంటూరు జిల్లా కాంగ్రెసు కార్యవర్గము 24 న ఇచ్చట చాపరాల కృష్ణబ్రహ్మంగారి అధ్యక్షతన సమావేశమై డాక్టరు పట్టాభిగారి 69 వ జన్మదినోత్సవ సందర్భమున వారిని అభినందించుచూ, వారికి తమ శుభాకాంక్షలు తెల్పుచు, నూతన రాష్ట్రపతి అయిన సందర్భంగా వారిని అభినందించుచూ తీర్మానించిరి. ధాన్యం ధర బస్తాకి రు 18/- లు ఉండాలనీ, అది తేని పంటలధరలు కంట్రోల్సు తొలగించకముందు వున్న ధరపై నూరింట 75 వంతులు పెంచాలని తీర్మానించిరి.

సంగమేశ్వరం, కొనవర్తి మొదలైన జలాశయముల నిర్మాణము ప్రభుత్వము వెంటనే ఆరంభించి భవిష్యత్తులో కాటక నివారణకు వెంటనే పునాదులు వేయవలెనని కూడా తీర్మానించిరి.

## అల్వినుకంపెనీ మదరాసు శాఖ

మదరాసు, నవంబరు 29: బొంబాయిలోని అల్విన్సు లిమిటెడ్ కంపెనీ మదరాసుశాఖ ప్రారంభోత్సవం నిన్న సాయంకాలం రాజాజీ హాలులో సి. ఆర్. శ్రీనివాసనుగారు జరిపిరి. మేయరు ఎస్. రామస్వామినాయుడుగారు సభకధ్యక్షత వహించిరి. జల్పాహారముల విందు యినాక, డి. ఆర్. అయ్యంగారు, కంపెనీయొక్క మేనేజింగ్ డైరెక్టరు వి. ఎస్. చోక్సీగారిని సభకు పరిచిన తర్వాత చోక్సీగారు స్వాగతోపన్యాసము నొసంగుచు తమ కంపెనీ చేస్తున్న వ్యాపారం గూర్చి విపులంగా తెలిపిరి. సెంటులు, అత్తరులు సబ్బులు పేసు పవుడర్లు, ముఖానికి వ్రాసుకునే ముద్దలు, యిత్యాది సౌందర్య పోషణ సరంజామా అంతా వీరు తయారు చేయుట యందు, బొంబాయి రాష్ట్రంలో ప్రసిద్ధిగాంచిరి. ఇప్పుడు మదరాసులో గ్రాండ్వేయందు సాలేమా వద్ద (టక్కర్సు లేను)లో శాఖాకార్యాలయం తెరచిరి. వరదరాజులు కంపెనీకి చెందిన రాజులుగారు, యీ శాఖాధికారులుగ నుందురని. బొగ్నెలు మెటలు సర్కు కి చెందిన బాడ్నెటుగారు కూడా యీ కంపెనీని ప్రశంసించిన పిమ్మట సి. ఆర్. శ్రీనివాసనుగారు ప్రసంగించుచు, గత పదిహేనేళ్లలో యీ కంపెనీవారు చాల వ్యాపారం చేసిరనియు, విదేశ వ్యాపారస్థుల పోటీకి నిలచి, అప్పటి విదేశ ప్రభుత్వం తోడ్పడక పోయిన బాగుగ అభివృద్ధి చెందిరనియు, సీగ యీ రాష్ట్రంలో గూడ తమ వ్యాపారం పెంపొందించుకొని విదేశమార్కెట్లగూడ ఆక్రమించాలని కోరుచున్నానని. జె. పార్థసారథిగారు వందనము లర్పించుటతో సభ ముగిసెను.

సభా నిషేధము

మదరాసులో బహిరంగసభలు ఉత్సవాలు మొదలగునవి జరుపరాదని నిషేధాజ్ఞ 1949 డిసెంబరు 28 వరకు అమలునందుండునని పోలీసు కమిషనరుగారు ప్రకటించిరి.

# నాన్‌కింగ్‌కు 35 మైళ్లలో కమ్యూనిస్టు సేనల విజృంభణ

## రాజధానికి దక్షిణంగా పెంగ్పూవద్ద వంకుల సమరం: షాంగైకి ప్రమాదం

నాంకింగు, నవంబరు 28: చైనా రాజ్యమునకు ముఖ్యపట్టణమైన నాంకింగు నగరమునకు 35 మైళ్ల దూరములోనికి కమ్యూనిస్టు సేనలు వచ్చినవని వార్తలువచ్చెను. కాని 10 వేల కమ్యూనిస్టు సేన నేడు వెనుకకు తరిమివేయబడెనని అనంతరం వార్తయొకటి వచ్చెను.

నాంకింగు నగరానికి షూఘా నగరమునకు మధ్యనున్న రైలుమార్గమును ఒక చోట కమ్యూనిస్టు సేనలు ఛేదించి దక్షిణముగా విజృంభించెను. నాంకింగు నగరమునకు ఉత్తరముగా 35 మైళ్ళ దూరములోనున్న చింగు పాలింగు అనే రైలుస్టేషనును పట్టుకొనుటకై కమ్యూనిస్టుసేన విజృంభించుచున్నదని ప్రభుత్వపక్షమువారు తెలియజేయుచున్నారు. నాంకింగు నగరములోని పరిస్థితి ఎట్లున్నదో ఏమీతెలియడంలేదు. అగమ్య గోచరంగా ఉంది.

షూకోవద్ద నుండియు, పెంగ్పూ నుండియు, చింగుపారింగు రైలు మీదుగా టింగ్యూయానుకు ప్రభుత్వసేనలు క్రొత్తవి జమాగా పంపబడుచున్నవి. ఈ ప్రాంతములో కమ్యూనిస్టు సేనలు 20 వేలకంటె హెచ్చులేవనియు ఈ సేనల ప్రమాద మెక్కువ లేదనియు ప్రభుత్వ పక్షము తెలియజేయుచున్నది.

చైనాలో కమ్యూనిస్టులును, ప్రభుత్వపక్షము నాంకింగు నగరమునకు 170 మైళ్ళ దూరములో ఉన్న పెంగ్పూ నగరమువద్ద మూడులక్షల సేనను ప్రయోగించి పోరాడుచున్నవి. చైనాకు ముఖ్యపట్టణమైన నాన్‌కింగు నగరమునకు పోయెడి మార్గముమీద ప్రభుత్వ సేనలకు బలమైన కట్టకాపటి దుర్గము పెంగ్పూతప్ప మరొకటి లేదు. ఇది మూచౌకు 30 మైళ్లు దక్షిణంగానున్నది.

## మదాం చాంకైషేక్ ప్రయాణం

నేటి రాత్రి మదాం చాంకైషేక్ అమెరికన్ నౌకాదళ శాఖకు చెందిన ఒక రవాణా విమానముమీద బయలుదేరి చైనానుండి అమెరికాకు వెళ్ళెను. ఆమె బుధవారము నాటికి వాషింగ్టన్ నగరమునకు చేరును.

మదాం చాంకైషేకు పతి చైనాకు ఎక్కువ సహాయమును చేయవలసినదిగా అమెరికా ప్రభుత్వమును అడుగుటకై అమెరికాకు బయలుదేరివెళ్లెను. అమెకు వీడ్కోలొసంగుటకు డా॥ సూన్‌ఫోగారు షాంగై నగరమునకు వచ్చిరి.

## పెంగ్పూనుండి కాందిశీకులు

ప్రస్తుతము యుద్ధం జరుగుచున్న పెంగ్పూ నగరమునుండి కాందిశీకులై వచ్చిన ప్రజలు షాంగై నగరము చేరిరి. కమ్యూనిస్టు సేనలు పెంగ్పూలోనికి చొచ్చుకొనిరాలేకపోయినయెడల కియాంగ్సూ పరగణా ఉత్తరప్రాంతము మీదకు తూర్పుదిశగా కమ్యూనిస్టుసేనలు విజృంభించి నాంకింగునగరము మీదకుగాని షాంగై నగరముమీదకుగాని దండెత్తగలవు. ప్రభుత్వపక్షసేనలు కమ్యూనిస్టులవశముందున్న రైలుస్టేషనుగల మూసిన్ అను పట్టణమునకు దక్షిణముగా పోరెను. పెంగ్పూకు ఉత్తరముగా మూసిన్ కలదు. ప్రభుత్వపక్ష సేనలు తమ విమానాలతో నిన్న మూసినువద్ద దాడిజరిపి కమ్యూనిస్టు సేనలను చాలా నష్టపరచెను.

## షాంగైవద్దకు యుద్ధం సమీపించుచున్నది

షాంగై నగరమునకు యుద్ధం సమీపించుచున్నందువల్ల సముద్రతీరమువద్ద అమెరికను యుద్ధనావలు చేరుచున్నవి. మరొక అమెరికను యుద్ధనావ క్రొత్తగా షాంగై రేవుకు నేడు చేరినది. బ్రిటిష్ క్రూయిజరు (10 వేల టన్నుల) యుద్ధనావ "సస్సెక్సు" కూడా యిచట కలదు.

## ఉత్తరచైనాలో యుద్ధం

ఉత్తర చైనాలో పీపింగునగరముమీదకు కమ్యూనిస్టుసేనలు తూర్పునైరుతినుంచి దండయాత్ర సాగించుచున్నది. కాని ఆ కమ్యూనిస్టుసేనలు వెనుకకు తరిమివేయబడెను. ప్రభుత్వసేనలు ఇంకా విజృంభించినయెడల కమ్యూనిస్టుసేనలను చుట్టుముట్టివేయవచ్చును. అప్పుడు ప్రభుత్వసేనలు హోపే పరగణాలోని తూర్పు ప్రాంతంలోనున్న ప్రభుత్వసేనలతో కలియవచ్చును. టాంగ్షా నుతోను బొగ్గుగనుల ప్రాంతములోని ప్రజలు ఖాళీచేసిపోవుటకు సిద్ధముగా నుండవలెనని అచటిప్రజలకు హెచ్చరిక చేసెను.

టీన్‌సిను ఉత్తరముగా 150 మైళ్ళలోనున్న చిన్‌వాంగ్ టావోవద్దనున్న ప్రభుత్వసేనలను అచటనుండి తీసికొనివచ్చుటకై నియమింపబడిన నావలు తుఫాను సముద్రము భీకరముగా నుండుటవల్ల బయలుదేరక విడిచిపోవలసివచ్చెను. నావలోని నావికులు కూడా అస్వస్థులుగా నున్నారు అని ఓడియొకవార్త వచ్చినది. చిన్వాంగుటావో రేవుకు మార్గ సంబంధం లేకుండా యితరవల కమ్యూనిస్టులు మార్గమును ఆక్రమించిరి.

## చైనాకు కొత్త మంత్రివర్గము

గత వారం చైనా ప్రభుత్వము నకు క్రొత్త ప్రధానమంత్రిగా నియమింపబడిన డా॥ సూన్‌ఫోగారు తన క్రొత్త మంత్రివర్గమును ఏర్పాటు చేసుకొనుటలో నిమగ్నులై షాంగై నగరములో ఉండగా, పెంగ్పూవద్ద ఫిరంగులు మోగుచున్నవి.

చైనాకు స్వతంత్ర ప్రజారాజ్యముగా ప్రతిష్ఠించిన డా॥ సన్‌యట్‌సేను కుమారుడే డా॥ సూన్‌ఫోగారు.

డా॥ సూన్‌ఫోగారికి దీర్ఘకాలముగా ఉన్న వ్యాధియొకటి కలదు, దానికి చికిత్స పొందునిమిత్తమై నేడు. వారు షాంగై నగరమునకు వచ్చిరి. క్రొత్త మంత్రివర్గ నిర్మాణ కార్యభారమును నిర్వహించుటకు వారు సంసిద్ధులుగాలేరు. కాని చైనాఅధ్యక్షుడు వారిని యీ కార్యభారము వహించవలసినదిగా కోరుచున్నారు.

క్రొత్త మంత్రివర్గంలో ఇద్దరు కమింగుటాంగు (జాతీయపక్షము) ప్రతినిధులు ఉండగలరు. డెమోక్రటిక్ సోషలిస్టులు, యువక చైనా పార్టీవారుకూడా యీ మంత్రివర్గములో చేర్చుకొనబడుదురో లేదో ఇంకా ఆలోచనలోనున్నదని డా॥ సూన్‌ఫోగారు చెప్పిరి. ఈ యుద్ధకాలములో యీ మంత్రివర్గమునకు చాలా ఎక్కువ అధికారము లుండునని కూడా చెప్పిరి. క్రొత్త మంత్రివర్గంలో కొద్దిమంది మంత్రులే మిగిలిగా వుంటారని డా॥ సూన్‌ఫోగారనిరి.

## మాల్కం మాక్డొనాల్డు సయాము ప్రయాణం

సింగపూర్, నవంబరు 29: ప్రస్తుతం బ్రిటిషు రాయబారిని చూచుటకు దక్షిణ ఆసియాలోని బ్రిటిషు కమీషనర్ జనరల్ మాల్కం మాక్డొనాల్డు నేడు బాంకాకునకు వెళ్ళెను. అక్కడ ఒక వారమురోజులుండును. దక్షిణ ఆసియా దేశముల నాయకులను కలిసికొన ఈయన తలపెట్టెను. ఇప్పుడు సయాము నకు వెళ్ళుటలో ఉద్దేశము.

"Nirmal's"

A GREAT NAME IN GLASS

నిర్మల్‌వారి గాజు సామగ్రికి గాజు పరిశ్రమలో అగ్రస్థానం. అందరి అవసరాలకు అనుగుణంగా మేము సరకు సరఫరా చేస్తాము.

NIRMAL GLASS WORKS LTD OLAVAKKOT MALABAR

పూజా కన్సెషన్

15 రాళ్ల రిస్టు వాచి 35/- (కంట్రోలు 46/12

స్విస్ తయారీ. ప్రతిది 5 ఏళ్ల గ్యారంటీ.

| | పెనుటిధర. | తగ్గింపుధర. |
| --- | --- | --- |
| చతురం ఆకారం క్రోం | 20-8-0 | 18-8-0 |
| సెంటర్ సెకండ్ | 22-8-0 | 20-8-0 |
| ప్లాట్ షేప్ క్రోం | 24-8-0 | 22-8-0 |
| „ „ చిన్నసైజు | 32-8-0 | 28-0-0 |
| „ „ సెంటర్ సెకండ్ | 35-8-0 | 30-0-0 |
| 15 రాళ్ళ క్రోం | 46-12-0 | 35-0-0 |

అలారం టైంపీసు 20-8-0. సుపీరియర్ 25-8-0 బెస్టు 30-8-0. ఏ రెండు వాచీలైనా కొన్నవారికి రు5-8-0 ఖరీదుగల ఒక ఫౌంటెన్ పెన్ ఉచితం

| | | |
| --- | --- | --- |
| రాజా ఫౌంటెన్ పెన్ | 4-8-0 | 3-8-0 |
| „ „ సుపీరియర్ | 6-8-0 | 5-8-0 |
| బెస్టు రాజా „ గోల్డు నిబ్ తో | 10-8-0 | 8-8-0 |

MODEL PEN SUPPLIERS,
Post Box No. 6772. CULCUTTA

భారత్ బ్యాంక్ లి॥

హెడ్ ఆఫీసు: ఢిల్లీ.

BB

చెల్లించిన మూలధనము . . . రు 2,01,37,175
రిజర్వు ఫండు . . . రు 40,00,000

దేశమంతటను 200 పైగా ఆఫీసులు కలవు.

అన్నిరకముల బ్యాంకింగ్ వ్యాపారము చేయబడును.



దేవాలయ పరిశుభ్రతకు

పవిత్రతకు దైవత్వమునకు దగ్గర సంబంధము కలదు. ఆదారనీయ మములతో పవిత్రముగా స్నానము చేయుటకు మనము పరిశుభ్రమైన సబ్బునే వాడవలెను. సబ్బులో యేదో యుండవచ్చును. కాని గోద్రెజ్‌యొక్క అన్ని టాయిలెట్సుకు వలెనే గోద్రెజ్ చందన సబ్బులో గూడ స్వచ్ఛమయిన, మేలైన, మూలికా తైలములు ఎన్నెన్నులు, ధారాళముగా వాడబడినవి. ఏవిధమగు జంతుక్రొవ్వు కలియలేదు. గోద్రెజ్ చందనపు సబ్బు, స్వచ్ఛమైన మైసూరు చందనతైలముతో తయారుచేయబడినది. అది హాయినిగొల్పు, చల్లని మనోహరమగు సువాసనగల నురుగును పుట్టించును. మీగడ వంటి యీ మూలికా తైలముల నురుగు రోమకూపములను స్మరపర్చి, చర్మమును మొహమల్‌వలె మనుపుగా జేయును. చల్లదనము చేకూర్చును. గోద్రెజ్ వెజిటబుల్ చందనసబ్బు కంటె స్నానమునకు మంచిది వేరేకలదా యని మనలో మనము ప్రశ్నించుకొని నిష్పక్షపాతముగా సమాధానము చెప్పుకొనవచ్చును. ఎందువల్ల ననగా, శరీరమే దేవునియొక్క ఆలయము.

గోద్రెజ్ లింబ (క్రిమిసంహారకం, చికిత్సా గుణములుగల వేపనూనె లక్షణముల గలది.

నెం. 1 . నెం. 2 “వత్ని”. శాండల్ లింబ (నీం) టర్కిష్ బాత్ షేవింగ్ స్టిక్ షేవింగ్ ‘శాండ్’

నూటికి నూరుపాళ్లు పరిశుద్ధమైనవనియు, జంతువుల క్రొవ్వు చేర్చబడనియు గ్యారంటీయివ్వబడినది.

Godrej Sandal

గోద్రెజ్ శాండల్

దావి బ్రాండ్ టాయిలెట్ (ముద్రల) (చందన) సబ్బులు

ఇతర చందన సబ్బులకంటె తక్కువ ఖరీదులో ఎక్కువ మేలైన సబ్బు

గోద్రెజ్ సోప్సు, లిమిటెడ్. మద్రాసు: 164, బ్రాడ్వే: కొచ్చిన్: 6/36 కల్వెట్టి.



బ్యాంక్ ఆఫ్ బరోడా, లిమిటెడ్.

(స్థాపితము: 1908)

ఘనతవహించిన, గయక్వార్ మహారాజావారి ఆదరణక్రిందను, తోడ్పాటుక్రిందను బరోడాలో స్థాపించబడినది. మెంబర్ల లయబిలిటి పరిమితము

| | | | |
|---|---|---|---|
| అనుమతిపొందిన మూలధనం | రు. 2,40,00,000 | చెల్లించబడిన మూలధనము | రు. 1,00,00,000 |
| జారీచేసి, చందాచేసిన మూలధనం | రు. 2,00,00,000 | రిజర్వు ఫండు | రు. 1,05,00,000 |

హెడ్ ఆఫీసు: బరోడా

మద్రాసు బ్రాంచి: 8, వెంకటాచలం చెట్టి వీధి, జి. టి. టెలిఫోన్: 2575.

కోయంబత్తూరు బ్రాంచి: 86, పెద్ద బజారు వీధి, టెలిఫోన్: 280.

భారతదేశమున అన్ని కేంద్రములలోను, బ్రాంచీలు, ఏజెన్సీలు కలవు.
అన్నిరకముల దేశీయ-విదేశీయ బ్యాంకింగువ్యాపారం చేయబడును. అప్రూవుడు ఖాతాదార్లకు స్టెర్లింగ్, డాలర్ క్రెడిట్లు యేర్పాటుచేయబడును. విదేశ బిల్లులు నెగోషియేట్ చేయబడును.

డబ్ల్యు. జి. గ్రౌండ్‌వాటర్, జనరల్ మేనేజరు.


Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St, G T. Madras

# బావులక్రింద పండిన ధాన్యానికి ఎక్కువధర

## కావాలని కడపజిల్లా రైతులకోరిక

కడప, నవంబరు 27: కడపజిల్లా రైతు కాంగ్రెసు ప్రథమ మహాసభ నిన్న రాయచోటితాలూకా చిన్నమండెంలో సి.ఎల్. నరసింహారెడ్డిగారి అధ్యక్షతన జరిగెను. వి. నరసింహులు శ్రేష్ఠిగారు ప్రతినిధులకు స్వాగతమిచ్చిరి. పి. బసిరెడ్డిగారుమహాసభ నుప్రారంభించిరి. నరసింహారెడ్డిగారు అధ్యక్షోపన్యాసంలో రాయలసీమ రైతాంగ కోరికలు ఎట్లు నిర్లక్ష్యము చేయబడినవో తెలిపిరి.

దేశమునకు స్వాతంత్ర్యము లభించి పరిపాలనము దేశనాయకుల హస్తగతమైనచో దుస్థితి మారునని ఎంతయో ఆశ పెట్టుకొనియుంటిమి. కాని మన ఆర్థికస్థితి చక్కబడుటకు మారుగా ఏవియో కొన్ని మంచిమాటలు చెప్పుట, కొంత సవ్వముఖము చూపించుట మాత్రమే జరిగినది. ఒకరివెనుక మరియొకరు ఎందరో మంత్రులు మనజిల్లాకు వచ్చినపుడంతయు ఈ అమాయకపు రైతులకు ఎన్నెన్నో వాగ్దానములు గావించిరి. కాని అందులో ఒకటికూడ ఈనాటికి నెరవేర్చరైరి. వ్యవసాయమునకై మన జిల్లాలకు విద్యుచ్ఛక్తిని ఇవ్వమని కోరగా పరికరములు లేవని చెప్పుచూ అరవ జిల్లాలలో అనేక తాలూకాలకు ఒసగి ఉన్నారు. మన జిల్లాలకు పరిసర జిల్లాలో ఉండు ఆర్థిక శాఖమంత్రిని ఈ విషయమై మనకు సహాయము చేయమనికోర్కగా మనజిల్లాకు ప్రక్క జిల్లాఅగు నెల్లూరు జిల్లాలో ఒక థర్మల్ స్టేషనును స్థాపించుటకు ఏర్పాటు చేసుకొని మనకు ఆ విధముగా వారి వాగ్దానమును చెల్లించుకొని ఉన్నారు. మన విజ్ఞాపనలు ఈ రీతిగా నిర్లక్ష్యం చేయుచుండగా ఏదినము మన రాయలసీమ ప్రతినిధులకు శాసనసభలనుండి బయటికివచ్చు పౌరుషము కలుగునో నాకు తెలియకున్నది. ఇప్పుడు జరుగుచున్న పరిస్థితులనుగమనించి అసంతృప్తి పడని రాయలసీమ ప్రతినిధి శాసనసభలో ఉండవలదనియే నేను భావించుచున్నాను' అని వారనిరి.

తర్వాత వారు ఆహార ధాన్యములపై మరల కంట్రోళ్ళు విధించుటను విమర్శించిరి. రైతులు ఎంతయో విముఖులుగా ఉండగా కంట్రోళ్ళను మరలా ప్రవేశపెట్టుటకు వీలులేదని ఇండియా ప్రభుత్వమువారికి తెలియజేయు ధైర్యము మన రాష్ట్రమంత్రివర్గమువారికి ఎందులకు లేకపోయినదో నాకు తోచుటలేదు. ధాన్యసేకరణకు ఎవరైనా వచ్చినయెడల వారిని తమ ఇండ్లలోనికి రానివ్వకుండుటకు రైతులు ఇప్పుడు గట్టిగా నిర్ధారణచేసికొనినటుల అగుపడుచున్నది. కంట్రోళ్ళను పెట్టునెడల ప్రజానీకము సత్యాగ్రహము చేయుటకైనా సిద్ధముగానున్నారని రంగాగారు హెచ్చరించి యున్నారు. వారు చెప్పినదానితో నేను ఏకీభవించుచున్నాను. ప్రాజెక్టులు, కాలువలు, విద్యుచ్ఛక్తి సహాయముగల ప్రదేశములలోను, చాల లోతుగల బావులనుండి అధికధరలకు ఎద్దులనుకొని వానిని పోషించుటకు మరింత ఖర్చుపెట్టి చాల శ్రమలనోర్చి పంటలు పండించు రాయలసీమలోను ధాన్యమునకు ఒకటే ధర నిర్ణయింపబడినపుడు ఏమి చేయవలసి ఉన్నది? రాయలసీమలో ఒక బస్తా వడ్లకు కనీసము రూ. 20/- లైనా ఉంచవలెనని రంగాగారు చెప్పుచున్నారు. ఇందులకు వారికి రాయలసీమవాసుల తరపున కృతజ్ఞతను తెలుపుచూ నేను మరియొకమాట చెప్పుచున్నాను. బావుల నీటితో పండించబడిన వడ్లకు బస్తా ఒకటికి రూ. 30/- లైనా చాలదు.

కంట్రోళ్ళు మరల పెట్టవలయునని ఆందోళన చేయుచున్నవారు కమ్యూనిస్టులును, ఉద్యోగస్థులును ఇంకా పెద్ద ఊర్లలో ఉండు సెలజీతగాళ్లే. కాంగ్రెసు సంస్థపై రైతులకు అసంతృప్తి కలుగజేయుటే కమ్యూనిస్టుల లక్ష్యం. పల్లెలలో అప్పుడే తమ ప్రచారమును కమ్యూనిస్టులు కంట్రోళ్లను మరలా పెట్టు విషయమును పురస్కరించుకొని ప్రారంభించినారు. రైతులలో కమ్యూనిస్టు విష ప్రచారమును తక్షణం నిలుపుటకు సర్వశక్తులు వినియోగించవలసి యున్నది. ఇందుకుగాను అధికారులకు నేను మనవి చేయునదేమనగా రైతును అసంతృప్తిపరచకూడదు. చాల ముఖ్యమైన కారణములచే కంట్రోళ్లు పెట్టుట అనివార్యమగునెడల రైతుకు ధాన్యమునకు సరియైన ధరలనైనను నిర్ణయించవలెను. ధరలను నిర్ణయించుటలో ధాన్యమును ఉత్పత్తిచేయుటలో గల కష్టసుఖములను తెలియని ఉద్యోగస్థుల సలహాల ప్రకారముకాక స్వసాయదారుల ప్రతినిధులయొక్కయు, రైతుసంఘములయొక్కయు సలహాల ప్రకారము చేయవలెను. రైతులు నేటి కేరే నాయకుల చర్యలను తొందరపడి విమర్శించుచున్నదని నా విజ్ఞాపన. మన అవసరముల న్యాయమును, ఆవశ్యకతను పదేపదే వారికి నిబ్బరముతో తెలియజేయుచుండవలెను. అని వారు ఉపన్యసించిరి.

# చర్మకారుల కోర్కెలు

## రాష్ట్రచర్మకారకుల మహాసభ తీర్మానములు

మానికొండ, నవంబరు 20: ఆంధ్రరాష్ట్ర జాతీయ చర్మకారక, ద్వితీయ మహాసభ గతవారం ఇచ్చట కాకాని వెంకటరత్నంగారి అధ్యక్షతన జరిగెను. సుమారు 5000 మంది హాజరైరి.

ఉదయము రాష్ట్ర కార్యవర్గ సమావేశము, మధ్యాహ్నము అధ్యక్షుని ఊరేగింపు జరిగెను.

శ్రీ టి. వి. రాఘవులుగారు, సభను ప్రారంభించుచు, చర్మపరిశ్రమవలన, పెట్టుబడిదారులు అధిక లాభాలను సంపాదించుకుంటూ, అందు పనిచేయుచున్న పనివారు అధికబాధలు పడుతున్నారనియు, చర్మకారులు, సహకార పద్ధతులద్వారా, చర్మపరిశ్రమను పెంపొందించి, తమ ఆర్థికాభివృద్ధికి, దేశకల్యాణానికి పాటుపడవలెననియు హెచ్చరించిరి.

అధ్యక్షులు ఉపన్యసించుచు స్వతంత్రభారత దేశములో మానవులందరికి సమాన హక్కు లున్నవని, ఇకనైన అగ్రజాతులు, నిమ్నజాతులయెడల సుహృద్భావముతో మెలగాలనిరి. నిమ్నజాతులలో మిక్కిలి వెనుకబడియున్న చర్మకారులకు ప్రభుత్వము, కాంగ్రెసు పార్టీకూడ సహకారము చూపి, వారికి అన్ని శాఖలలోను సమాన ప్రాతినిధ్యము ఇవ్వవలయుననియు, చర్మకార సంస్థను వెంటనే అఖిలభారతజాతీయ ట్రేడ్‌యూనియన్, కాంగ్రెసుకు, అనుబంధ సంస్థగా, చేర్చి కాంగ్రెసుపార్టీ, సహకారముతో, పనిచేసి, తమ సంఘాభివృద్ధికి తోడ్పడవలెనని హెచ్చరించిరి.

### కార్యదర్శి నివేదిక

పిమ్మట ప్రధాన కార్యదర్శి యం. రాజేశ్వరరావుగారు, సంఘాభివృద్ధిని గూర్చిన నివేదికను చదివిరి. చర్మకారక వర్గమునకు చాలకాలమునుండి, ప్రభుత్వము రాజకీయపార్టీలు, చాల అన్యాయాలను, చేసినవి. వాటినుండి, విముక్తులగుటకే యీ సంఘము స్థాపించబడినది. చర్మ పరిశ్రమను, చర్మకారులు, సహకార పద్ధతులద్వారా, పెంపొందింపవలెను. ఇంతవరకు, 20 వేల సభ్యత్వమున్నది. సంఘము, ఆర్థికముగా, వెనుకబడియున్నది. కనుక, అగ్రజాతులు గూడ, యీ సంస్థను, బలపర్చవలెను. చర్మకారుల బాగోగులు నరయుటకై స్థాపింపబడనున్న, ‘చర్మకారి’ యను మాస పత్రికకు, అందరును, విరాళముల నివ్వవలెను, అని అందుకలరు.

తరువాత, అప్పికట్ల జోసఫ్, డాక్టరు కె. నీలయ్య, బి. జ్ఞానానందము గార్లు, ఉపన్యసించిరి. సంఘాధ్యక్షుడు బి. వందనముగారు, చర్మకారులు నిత్యము ఆసక్తితో పనిచేసి, తమవర్గ సాంఘిక, ఆర్థిక రాజకీయాభివృద్ధులకొరకు, పాటుపడవలెనని హెచ్చరించిరి.

### తీర్మానాలు

పిమ్మట, యీ క్రింది తీర్మానములు చేయబడినవి: ‘ఆంధ్రరాష్ట్ర చర్మకారక సంఘము’ అను దానికి జాతీయ అని కలిపి, యిక మీదట, ‘ఆంధ్రరాష్ట్ర జాతీయ చర్మకారక సంఘము’గా వ్యవహరించుటకును, యీ సంఘమును, ఐ. యన్. టి. యు. సి. కి అనుబంధ పర్చుటకు తీర్మానించడమైనది. డాక్టరు భోజరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు, రాష్ట్రపతిగ ఎన్నిక అయి ఆంధ్రదేశమునకు, వన్నె తెచ్చినందుకు, సంతసించుచు వారిని అభినందించడమైనది. చర్మకారులు ఎక్కువ వేతన మివ్వవలెనని ఆందోళన చేయుట, చర్మవృత్తి చేయించు కాబూలు సాహేబులు టానరీ షాపులను మూసివేయుటవలన ఏలూరు, విజయవాడలలో నిరుద్యోగులైన చర్మకారులకు పని చూపించుచు, వారిని ప్రస్తుతమున్న యిండ్లనుంచి తొలగించుచున్న బాధనుబాపి, వారికి వెంటనే గృహవసతి కల్పించవలెనని ప్రభుత్వమును కోరడమైనది.

హరిజనోద్ధరణ మంత్రి వి. కూర్మయ్యగారు, మాదిగల యెడ వహించుచున్న వైఖరిని విమర్శించుచు, మాదిగజాతికి న్యాయము కలుగజేయవలసినదిగా, రాజేంద్రబాబు, పటేలు, డా॥ పట్టాభి, ప్రకాశంగార్లను కోరడమైనది. చర్మపరిశ్రమ నిమిత్తము, 10 లక్షల రు. ప్రత్యేకించినందులకు ప్రభుత్వమును అభినందించడమైనది. జిల్లా రాష్ట్ర హరిజన యోగక్షేమ సంఘాలలో చర్మకారులకు, జనాభా ప్రకారము ప్రాతినిధ్యము నివ్వవలెనని జమీందారీబిల్లు ఫలితముగా ప్రభుత్వమునకు లభించు, ఎస్టేటు భూములను చర్మకారులకుమంజూరుచేయవలెనని చర్మకారులు క్రొత్తగా స్థాపించిన హరిజన వసతిగృహములను వెంటనే గుర్తించవలెనని ప్రభుత్వమును కోరడమైనది.

పిమ్మట, బండారు వందనము, అధ్యక్షుడుగ చోంగుడి జాషువకవి, మట్టుపడి రాజేశ్వరరావు ఉపాధ్యక్షులుగ, మట్టు డానియేలు ప్రధాన కార్యదర్శిగ, యన్. రాయల్ సంయుక్త కార్యదర్శిగ, బి. బెంజిమిన్ కోశాధిపతిగ కార్యనిర్వాహకవర్గము ఎన్నుకోబడెను. నిబంధనావళిని తయారుచేయుటకును, పత్రికకొరకు చందాలు పోగుచేయుటకును, సంఘ ఆర్థికాభివృద్ధికొరకును, ప్రత్యేక ఉపసంఘములు నియమింపబడెను. అత్తోట రత్నం భాగవతారుగారి ‘జయప్రద’ హరికథా కాలక్షేపముతో మహాసభ ముగిసెను.

# వ్యాపార పంటలపై నిర్బంధం కూడదు

## ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్‌కార్యవర్గం తీర్మానాలు

నిడుబ్రోలు, నవంబరు 24: ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం మొన్న ఆదివారం నూచవరంలో శ్రీ ఎన్. జి. రంగాగారి అధ్యక్షతన సమావేశమై, ధాన్యం బస్తాకు కనీసధర రూ. 18/- లు నిర్ణయించవలెనని, నెల్లూరు, రాయలసీమ ధాన్యమునకు వేరే ధర నిర్ణయించవలెనని ప్రభుత్వానికి సిఫార్సు చేయబడెను. వ్యాపారపు పంటలు పండించే విషయమై రాష్ట్ర ప్రభుత్వం తీసుకొనదలచినచర్యను విమర్శించడమైనది. ఇండియన్ రిపబ్లిక్‌కు దాని ప్రజాసత్తాక స్వభావమునకు భంగం లేకుండ, సమానప్రాయాలో, ఇండియన్ యూనియన్‌కూ కామన్వెల్తుకూ ‘సజీవ సంబంధం’ పెట్టడానికై పండిత నెహ్రూ చేయుచున్న ప్రయత్నములను ఆమోదించుచు, భారత మహాత్మ్య బాపూజీ నిర్దేశించిన ఉన్నత పథమున నడచునట్లు చేయవలెనని భారత ప్రభుత్వమును కోరడమైనది. రాయలసీమ జిల్లాలలో అనావృష్టివల్ల పంటలకు ఎంతనష్టముకలిగినదో విచారించుటకు ఒక సంఘమును ఏర్పాటు చేయవలెనని ప్రభుత్వమును కోరడమైనది. కాంగ్రెసు సంఘములలో అధికార పదవులలో నున్న లాయర్లు వొంగవ్యాపారులు, బ్రౌగుబోతుల తరపు కేసులు వాదించరాదని హెచ్చరించడమైనది. ఈనాము బిల్లు వచ్చేలోగా ఈనాముదైతులపై గల కేసుల విషయంలో కోర్టువ్యవహారములు నిలుపు చేయవలెనని ప్రభుత్వమును కోరడమైనది.

# ఆంధ్ర యువజనకాంగ్రెసు మహాసభలు వాయిదా

పిప్పర, నవంబరు 26: ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెస్ అధ్యక్షుడు తుమ్మలపల్లి సత్యనారాయణగారిట్లు వ్రాయుచున్నారు:

అనివార్య కారణాంతరములచే వార్షికోత్సవాలు 1949 జనవరికి వాయిదా వేయబడినవి. ప్రతినిధుల పేర్ల పట్టికను పంపు గడువు జనవరి 10 తేదీవరకూ పొడిగించబడింది. అధీన సంఘాలను డిశెంబరు 14 వ తేదీలోగా రిజిష్టరుచేసుకోవడమునను. ఆ గడువులోపల జిల్లా తాలూకా ఫిర్కా, గ్రామసంఘాలన్నీ తమ తమ కార్యవర్గసభ్యుల చిరునామాలు పంపి రిజిష్టరు చేయించుకోగోరెదను. రిజిష్ట్రీ మనుషీజు లేదు. తమ ప్రాంతీయ సంఘాలన్నిటినీ రిజిష్టరు చేయించడంలో జిల్లా, తాలూకా, ఫిర్కా, సంఘాలు శ్రద్ధ వహించాలి. డిశెంబరు 15 లోగా తమతమ వార్షికనివేదికలను రాష్ట్ర కార్యాలయానికి పంపవలసిందిగా అన్ని అధీనసంఘాలు కోరబడినవి. జయపూరు కాంగ్రెసు మహాసభలతోబాటు అఖిలభారత యువజన కాంగ్రెసు మహాసభలు జరుగనున్నవి. గనుక జయపూరు రానున్న ప్రతినిధులకు ప్రత్యేక ప్రవేశపత్రాల నివ్వడమగును. రాగోరువారు నవంబరు 30 లోగా రాష్ట్ర కార్యాలయానికి తెలుపగోరెదను. కాంగ్రెసు మహాసభల విషయమైకూడా కొన్ని సౌకర్యాలు కలుగజేయుటకు రాష్ట్ర యు॥ కాం॥ కార్యాలయం 14 డిశెంబరు మొదలు జయపూరులో 5 రోజులుం టుంది.

పెనుకొండ తాలూకా విద్యార్థి కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగ అవధాని శేషాచార్యులు, కార్యదర్శిగ తల్లం రామయ్యశెట్టి ఎన్నుకొనబడిరి.

నరసన్నపేటలో, నవంబరు 22 న, ఆ పూరి వాస్తవ్యుడు కాశిన బసవరాజుగారు చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్‌కు అధ్యక్షుడుగా ఎన్నిక అయిన సందర్భమున పౌరుల తరపున తేనీటి విందొసగబడెను. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ సభ్యుడు పి. కోదండరావుగారి రాక సందర్భమున నవంబరు 25 న ఇచ్చటి గోఖలే శిశు సదనంలో తేనీటివిందు జరిగెను.


మీ సొమ్ముకు సాలిగూళ్లు

మీసొమ్మును తన గూళ్లలోకిలాగుకొంటూఉన్న సాలీడు ఉన్నాడని మీకు తెలుసునా? అతడేలాభాలుఆర్జించేవ్యాపారి. సరకులుస్వల్పముగా మాత్రమే ఉన్నాయనే సంగతిని కనిపెట్టి తన ధరలను అతడు హెచ్చిస్తున్నాడు; తరచుగా మీకుఅవసరములేని సరకులను వాటివిలువకు మీరిన ధరలకు కొనేలాగున మిమ్ము మోసపుచ్చుచున్నాడు. నష్టపోయేది మీరే.

కాని మీరు వివేకవంతులైతే అనవసరమైన కొనుగోళ్లు నన్నిటిని మీరు తాత్కాలికంగా ఆపివేస్తారు - ఇందుమూలంగా మీరు మీఆదనపురాబడిని నిల్వచేసుకోవటమే కాకుండా దురాశాపరవ్యాపారి తన సరకులను తక్కువధరలకు అమ్మేటట్లు చేసినవారౌతారు. ధరలు తగ్గేవరకు మీరు చేదియున్నయెడల మీసొమ్ము విలువయెక్కువ అవుతుంది. ఈలోగా మీనిల్వసొమ్మును వేర్వేరు రకముల గవర్నమెంటు సెక్యూరిటీలలో వడ్డీకి వేసుకోండి. ఇందువల్ల మీరు మీ మూలధనమును భద్రముగా కాపాడుకోవడమే కాకుండా మంచి వడ్డీని కూడా సంపాదిస్తారు.

నేషనల్ సేవింగ్సు సర్టిఫికెట్లపైన మీ సొమ్మును పెట్టండి. మీరు వీటిని ఐదు, ఏడు, పన్నెండు సంవత్సరాల తరువాతలో తీసుకుంటే ఇవి పుటవక్క పైన పిమ్మట వీటిమీద వరుసగా 3%, 3½%, 4 1/6% వడ్డీ మీకు వస్తుంది.

ఇతర గవర్నమెంటు సెక్యూరిటీలలోను, పోస్టు ఆఫీస్ అండ్ సేవింగ్సు బ్యాంకు అక్కౌంట్సులోను, భీమాకంపెనీలలోను సహకార సంఘాలలో మా కూడా మీ సొమ్మును వడ్డీకి వేసుకోండి.

రేపటికిగాను నేడే సొమ్ము నిల్వచేసుకోండి
నిల్వచేసినదంతా వివేకముతో వడ్డీకివేసుకోండి

ఇండియా గవర్నమెంటు, ఫైనాన్సు మినిస్ట్రీవారి ప్రకటన.



EVEREADY
Fresh Power
BRIGHTER LIGHT
LONGER LIFE

క్రొత్త EVEREADY బ్యాటరీ
TRADE-MARK

నేషనల్ కార్బన్ కంపెనీలో తయారైనవి



“యిస్పహానీ” మౌంటెయిన్ బూకే ఉత్తమోత్తమమైన తరగతికి చెందిన టీ. దాని యింపైన రుచి మీ పేద తీర్చి. మీకు మనోల్లాసము చేకూర్చును.

SEE THAT THE INNER LID OF THIS IS INTACT
ISPAHANI'S MOUNTAIN BOUQUET TEA

ISPAHANI'S TEA